కుంభకమగురువు । తదుచ్చిపరి గృహీత ద్వయుంబే మంత్రమద్యత దాస్య
మె యధికఫలము । సాధనాంతరమెల్ల శరణాగతవిరోధి ప్రాకృతభోగాశ
ఫలవిరోధి । వేద్య వేదక విద్వద్వివేక చతుర । పాదసేవకులే యెందుభాగ
వతులు । అనుచు దయతోడ నెప్పుడు నాత్మహితుమె । తెలిపి చెప్పును
లక్ష్మణ దేశికుండు॥ ౭

తా॥ సమస్తాత్మలకు శ్రియఃపతి నిరుపాధికమై యేలినయేలిక యనియు
నతని యసాధారణ తిరునామములు విష్ణువనియు వాసుదేవుండనియుఁ జె
ప్పఁబడియుండు తిరునామము లతనికిఁ జెప్పె ననియు వేదాంతసూత్రవివర
ణములకుఁగర్త శ్రీభాష్యకారులే మనకుఁ బరమగురువనియు నతని తిరునా
మమైన మంత్రమే ద్వయమనియు శ్రియఃపతి దాస్యమధిక ఫలమనియు సా
ధనాంతరములు శరణాగతులను విరోధము లనియుఁ బ్రాకృతభోగాశలు
ఫలవిరోధి యనియు వేదాంత వేద్యమైన రహస్యము ప్రకాశముగా వివేక
మై నైర్మల్యబుద్ధిచేత శ్రియఃపతికి శరణాగతులైనవారు భాగవతులనియు
నెప్పుడును విరోధములైన యహంకార మమకారములు విడువవలెనని
యాతీరున నాత్మహితవు దయతోడ నానతిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥
(శ్రియఃపతికి శరణాగతులకు విరోధములైన యహంకారాదులుఁబోయిన భా
గవతు లౌదురని యానతిచ్చి యావిరోధములైన యహంకారమమకారముల
వివరములు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఈశ్వరేశ్వర శేష మీయాత్మలై నప్పు డుచితంబుగాఁ దదీ
యులకుఁగాను । నాతదీయులు నంద అభిజన విద్యాద్యహంకార రహితులై
యరసిచూడ । నాయహంకారలే శాణుమాత్రంబున్న నాశమైయది యా
శ్రయాశిగాన । నదిపోయితా శేష తాను రూపముగాను నఖిలవైష్ణవులకు
నడిమెచేయఁ । బ్రాప్తి యిది యందఱికిఁగాను. భాష్యకారు । లందుఁజేయం
గఁదగువారి యందశేష । వృత్తియం దన్వయించిన విష్ణుభక్త । గురువులని
చెప్పె లక్ష్మణగురువరుండు॥ ౮

తా॥ ఈవిభూతులు రెంటిలో నాత్మకోటు శ్రియఃపతికి, శేషత్వమని
యెఱిఁగి నప్పుడు శ్రీవైష్ణవులకు శేషమని చెప్పు నది యుచితమై యుండున
నియు నా శ్రీవైష్ణవులందఱును దేహసంబంధులును నేర్చిన విద్యను దననడ
తను లెస్స విడిచిన వారలనియు నాయహంకారములు లేకయుండురనియు
నాయహంకారము లేశమైనను నణుమాత్రమైన నుండెనేని యదియగ్నిస్పర్శ

వంటివనియు నవపోఁగొట్టి తాను శేషత్వాను రూపముగా సమస్త శ్రీవైష్ణవు లకునడిను చేయువలెననియు నఁదఱికెనిఁ బొందఁ బడడి ప్రాప్తిప్రియతం డయిని యు నె, బెరుమానారు నందీదాస్యము చేయవలెననియు నతండు భయవిభూ తులకును నేలినవాఁడనియు నట్టిపడతయుం దన్వయించియుండిన విష్ణుభక్తికి నట్టివారుగురువులని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సమస్త శ్రీవైష్ణవులకును దా స్యము చేయుట కన్నను నెంబెరుమానారును దాసులపట్ల సంబంధబల మా నతిచ్చినమైశ్వర్యాదులు కాగాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ ఐశ్వర్య సుఖసిద్ధి యదిమంచిదంటిమా యజాదాధీపునకైన న స్థిరంబు । ఆత్మానుభవ సుఖం బదినిత్యమంటిమా భగవదనుభవ లేశ బాధి తంబు । పరమపద ప్రాప్తి బాగనియుంటిమా యదియును వది నిష్టమైనఁ గాదు । ఏదైన సర్వేశ్వరేష్టమైనది మంచిదని యంటి మా యిష్ట మతని కేది యొ । పరమవైష్ణవ శేషత్వపారతంత్ర్య ౹ లక్షణస్వానురూప విలక్షణా చ్య । తాశ్రయేష్టంబు సేయుటె యనుచుదినము। తెలిపిచెప్పును లక్ష్మణ దేశికుండు॥ ౯

తా॥ అధిక సంపదలతోడఁ గూడిన సుఖ మనుభవించునది యానిలుకడ లేదనియు । బ్రహ్మాదులు మొదలైన దేవతలకు నస్థిరమనియు నాత్మలకునను భవమున సుఖము కైవల్యమందు నిత్యమని యంటిమా శ్రియఃపతియొక్క సేవలేశమైన లేదుగనుక మహాదుఃఖ మనియు నీచేతనుండు శ్రియఃపతిని బ రమపదము ప్రసాదించుమని యడుగరాదనియు నతనియిష్టము మంచిదని యంటిమా తనకునిష్టమయినదిమాని శ్రియఃపతి యిష్టమేదియనఁగాఁ బరమ వైష్ణవులయొక్క శేషత్వ పార తంత్ర్యాదుల చేత నడువవలె ననియు నీలా గున నడువఁగా శ్రియఃపతి కిష్టమౌననియు నిదిపరమ హితముగా సకలచేత నులకెల్లఁ దెలియవలెనని లక్ష్మణార్యులాన తిచ్చిరి॥ ( భాగవతుల పట్లశేష త్వ పారతంత్ర్యదులు గలిగి నడువవలెనని యానతిచ్చి యర్థపంచక తా త్పర్యము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ స్వస్వరూపము బుద్ధిఁ జర్చించిచూచిన నది భాగవతశేష మని యెఱింగి । వైష్ణవాశ్రయణ మవశ్య మోక్షప్రదంబని పూర్వు లాసించుట దియెఱింగి । పురుషార్థ మిఁకవారి పూజ కెక్కుడులేదు తద్వేషమేనా శ తథ్యమెఱింగి । సంసార విషవృక్ష సంభవా మృతతుల్య ఫలభూతు లని చెప్పఁబడు టెఱింగి । విబుధులచ్యుత భక్తుల వెదకి వెదకి । కూడి సేనను

సరి యనుకొనుటమాని । వారికిష్టంబు చేసిన వాఁడెముక్తుఁ । డనుచులక్ష్మణ
మునివరుఁడానతిచ్చు॥ ౧౦

తా॥ తనస్వరూపమును దనబుద్ధిఁజూడఁగా భాగవతులకే యీయాత్మ
శేషమని యెఱుఁగవలెననియు నదియెఱింగి శ్రీవైష్ణవ సమాశ్రయణము వల
న శ్రియఃపతి మోక్షము ప్రసాదించుననీ పూర్వు లాసించుట లెఱుఁగవలె
ననియు వారిపూజలే మనకుఁ బురుషార్థ మనియు నాశ్రీవైష్ణవుల ద్వేష
మునకన్న నాత్మకు మఱియొకటి నాశనములేదనియు మఱియు సంసార
మనియెడి ముష్టిచెట్టునఁ బుట్టిన యమృతమునకు సరియైన ఫలములైన మహా
త్ములనియు నిట్టి పెద్దలయిన శ్రియఃపతి భక్తులను వెదకివెదకికూడి తాము
వారితో సరియనుకొనుట మానవలెననియు నట్టి శ్రీవైష్ణవులకు నిష్టము చేసిన
వారే ముక్తులని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( పెద్దలైన శ్రీ వైష్ణవులను వెదకి
కూడుఁడని యానతిచ్చి శ్రియఃపతికి దాసుఁడై యన్యదేవతల నాశ్రయించుట
కారాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ హరినన్య దైవంబు నాశ్రయించుట గదా యమృతంబు విష
మును నాశపడుట । విషయాంతరేచ్ఛయు విష్ణుసేవయుఁ గదా శౌచవిరహి
తయనుష్ఠాతయగుట । ధర్మాంతరము సిద్ధ ధర్మ వరణముగదా మోక్షులు
బ్రహ్మాస్త్రమును గలయుట । వైష్ణవులునుగాని వారిఁ గూడుటఁగదా స్వర్ణం
బునినుమును సదృశమగుట । యని వివేకించి వస్తువాసరసి చూచి । సాధ్యసా
ధనములనైక్య సరణిఁదెలిసి । సరస భగవత్ప్రపన్న సంసర్గ గలిగి । యుండవ
లెననె లక్ష్మణయోగివరుఁడు॥ ౧౧

తా॥ శ్రియఃపతికి దాసుండై యన్య దైవముల నాశ్రయించెనేని యమృ
తమును విషమునుగాఁ బ్రసాపడుట సరియనియు విషయాంతరముమీఁద నాశ
లును శ్రియఃపతియొక్క సేవాను శౌచము చేయకయే నిత్య కర్మానుష్ఠానం
బులు చేసినందుకు సరియనియు ధర్మాంతరములను సిద్ధమైన పరమ ధర్మ
మును రెండును గలిసి నడిచెనేని మోక్షులును బ్రహ్మాస్త్రమును గలిసినట్లనియు
నప్రాకృతులైన శ్రీవైష్ణవుల కూటమియుఁ బ్రాకృతులతోఁ గూటమిగూడె
నేనిబంగారమును నినుమునుగూర్చి నట్లనియునని వివేకించి వస్తువాసుల నేర్పా
టుగాఁ జూచి యనియు సాధ్యమైనందుకును ఫలించినందుకును. దనదగ్గిరను భ
గవత్ప్రపన్నులతోడి కూటమి గలిగి యుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥
( ప్రాకృత సంసర్గ విషమైన యాత్మకుఁగారాదని యానతిచ్చి కర్మభేదములే

సకలమైన దేహాదులు నని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కర్మభేదమె కాని గానను దేవాది తారతమ్యమునకు దారివేఱె। దేహభేదమె కాని తేజోమయాత్మ సంస్థానంబునకు వేఱె జాతిలేదు। భేదబుద్ధియె కాని పృథగవస్థితిలేమి తనకు నీశ్వరునకు దాస్యమునకుఁ। దలఁపుభేదమె కాని తథ్యమన్యము లేదు స్వగత పరగత వరణ సంధి తెలియ। ననుచు నన్నట్టె తెలిసిన యందఱికిని। సిద్ధమైయుండు మోక్షంబు చేతనులకు। బుద్ధిభేదంబు చేసినది పొసఁగకుండు। ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౧౨

తా॥ వారివారి కర్మభేదములవలన నే దేవ తిర్యఙ్మనుష్య స్థావరజంగమాదులైన దేహాదు లేర్పడురనియు వానితో నీ దేహ భేదమే కాని తేజోమయాత్మకంబైన యాత్మ స్థానమునకు వేఱైనజాతులు లేవనియు భేదములైన బుద్ధులింతే కాని శ్రియఃపతి దాస్యమునకును దనకును దొడ్డకొంచెములు లేవనియు ననుచు నున్నట్టె తెలిసిన యందఱికిని మోక్షము సిద్ధమై యుండు ననియు నీ చేతనులకు బుద్ధిభేదములవలన నిది పొసఁగకుండఁ బోవునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శరీర భేదములవలనఁ గర్మ భేదము లనియు నాత్మస్థానములు సకలాత్మలును సరియని యానతిచ్చి సంహారదశను నీయాత్మలకు శరీరేంద్రియముల నిచ్చి యెవ్వఁడు కాపాడునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సంహార దశను చిత్సముదాయ మెల్లను దన కప్పు డెవ్వఁ డిచ్చెను శరీరేంద్రియములు। ఏకార్ణవావస్థ నెఱిఁగి ముందరఁ దన కెవ్వఁడు కుక్షిలో నిరవుఁ జేసెఁ। దల్లిగర్భములోనఁ దా బద్ధుడైయున్న యప్పు డెవ్వఁడు భుక్తి యరసి పెట్టెఁ। దనబంధువులఁ బాసి తా సుప్తుఁడైన నప్పు డెవ్వఁడు దనుఁ గాచు నెఱుఁగకుండ। నతఁడు తనభక్తిముక్తుల కనుగుణముగఁ। గప్పెఁ గారుణ్యవిహితసంగతులఁ దన్నుఁ। గాచి రక్షించునని నమ్మగల మహాత్ముఁ। డపుడె కడతేరునని లక్ష్మణార్యులనిరి॥ ౧౩

తా॥ సంహారమునకుఁ దనలోనున్న యాత్మలను బ్రకృతిలోఁ గలిపి తిరిగి సృష్టి కాలమున నెవ్వఁడు మరల శరీరేంద్రియముల నిచ్చె ననియు సంహారమందు నేకార్ణవమైనప్పుడు తన్ను నెవ్వండు కడుపులో నుంచుకొనె ననియుఁ దనతల్లి గర్భములోనఁ దాను గట్టువడియున్నప్పు డెవ్వఁడు ప్రసాదించి పెట్టెనో కెననియుఁ. దనబంధువులఁ బాసి తాను నిద్ర వోవునపుడు దన్నెఱుఁగకుండ నెవ్వఁడు గాపాడుననియు నట్టి శ్రియఃపతి తనభుక్తిముక్తులకు ననుగుణముగాఁ జేయవలసిన సంగతులచేత నన్నుఁ గాచి రక్షించుననియు నమ్మికగలమ

నారు దాస్యశేషఫలమనియు నాఫలమును బొందుటకుఁ దాను దనదిగానుకొని భ్రమయఁగా దానికా భ్రమ యడ్డ పడు ననియుఁ జేతనాచేతనులకును సేలిన మేలుక తానే వచ్చి యీ రహస్యమును నానతీయ నాచార్యుం డౌనని యు నీరహస్యార్థమును నెఱిఁగించు సకల జనులనియు నిదియెఱిఁగి బ్రతుకవలెనని యెంబెరుమానారు జీయరెంత ఘనుండో యెంబెరుమానారు చరణములయందు భక్తి తాత్పర్యములు గలిగి కూరత్తాళ్వారులు మొదలైన మన వాళ్ మహామునుల పాదములకుఁ బరవశులై నీ లోక విలక్షణులైన లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ) యెంబెరుమానారు జీయరు రహస్యసారార్థ మెఱింగి సకలమయిన వారలుఁగ వలెనని యెంబెరుమానారు సంబంధులఁ జూపి రని యానతిచ్చి వేదాంత రహస్యమైన యర్థమును రహస్యముగా దాఁచ వలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఉపనిష ద్గత ధర్మ ముచ్చరించఁగ దాఁచి యడిగిన యం దర్థము ల్దాఁచి। యదిచెప్పినను గుహ్య మానతీయఁగా దాఁచి యార్యసిద్ధాంత మెట్లైన దాఁచి। యార్తులై సంవత్సరాను వర్తనశీలురైన వారికిఁ జెప్పి యనధికారి। చెవిఁబడకుండ నిక్షేపంబువలె దీనిఁ బదిలంబు చేసుక బ్రతుకఁడనుచు। నొకరొకరికిఁ జెప్పుచు నుందురఖిల। దేశికులెట్టి యర్థంబు దెలిపి మాకు। నిపుడు గత్యంతరాభావ మిదియె చూచి। యుడయవరుఁ బోలె లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౬

తా॥ వేదాంతాదులైన పురుష నిష్ఠులఁ బుట్టిన రహస్య ముచ్చరించక దాఁచవలె ననియు నది చెప్పినప్పటికిని నందుల యర్థమును నడిగి దాఁచవలె ననియు నా యర్థమును జెప్పి గుహ్యమైన తాత్పర్యమును దాఁచ వలెనని యుఁ బూర్వాచార్యులైన వారల యనుష్ఠానమెట్లైన దాఁచవలె ననియు నా రహస్యమం దాశగలిగిన సంవత్సరముల పర్యంతమును ననువర్తనగాఁ దిరిగిన వారికిఁ జెప్పవలెననియు నధికారులుగాని వారిఁ చెవిఁ బడకుండ నిక్షేపమువలె దీనిఁ బదిలము చేసుకొని బ్రతుకుండనియుఁ బూర్వాచార్య లొకరొకరికిఁ జెప్పుదురనియు సమస్తాచార్యులును నిట్టి పరమార్థమును దాసునికిఁ బ్రసాదించిరనియు నిప్పుడు పొందఁబడిన గతి యిదియని చూచియు నెంబెరుమానారు జీయరెంబెరుమానారు నై పోలునని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( వేదాంతరహస్యమును బహుప్రయత్నముల దాఁచవలెననియుఁ గావలసిన యా

త్రిపురునికిఁ బ్రసాదింతురని యానతిచ్చి పద్నాలుగు లోకములలోని సుఖానుభవముల తారతమ్యములు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చక్రవాళాంత భూచక్రమేలెడి సుఖము స్వర్గ సంరక్షణజాతసుఖము। చనిమహర్జన తపస్సత్యాది లోకంబు లరయుసట్టి సుఖంబుల న్నితాని। పరిపాలనముఁ జేయు బ్రహ్మ సుఖంబును కైవల్యమునముక్తి గలుగుసుఖము। పరుఁడు నీకని యిచ్చు పరమ పదంబును నీశ్వరత్వం బొంది యేలు సుఖము। మిథున కైంకర్య సుఖమును మేరువందు। నణువు నకునైన సరిగాదటనుచు దాస్య। సుఖమెఱింగిన యతిరాజు సౌమ్యులగుచు। నుండ వలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౭

తా॥ చక్రవాళాంతముగా నుండఁబడిన భూచక్రమేలెడి రాజు సుఖమును స్వర్గము రక్షించెడు నింద్రుని సుఖమును నా మీఁదను మహర్లోకము జనలోకము తపోలోకము సత్యలోకము మొదలైన లోకములు పరిపాలనము చేసెడి బ్రహ్మయొక్క సుఖమును కైవల్యమున ముక్తిలోని సుఖమును శ్రియఃపతి కృపచేత నిచ్చెడి పరమపదంబును నేలెడి రాజై యుండెడి సుఖమును శ్రియఃపతియుఁ బెరియపిరాట్టియుఁ గూడియుండఁగా సేవించెడి సుఖమునకు మేరువైనను సరిగాదు తక్కిన సుఖములందలి యణువునకు నైనను సరిగాదని యట్టి దాస్యసుఖమెఱింగిన పెద్దలు సకలమును నెంబెరుమానారు సౌమ్యలనుచు నుండుదురని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (ఈ లోకములలోని సుఖముల తారతమ్యము లానతిచ్చి సంసారమందుండిన వారు సహవాసమువలనఁ గడ తేరుదురని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సత్సంగ నిస్పృహ సంసారగురుముఖ ప్రాప్త లక్ష్మీశ్వర ప్రపదనప్రప। నష్టపూర్వోత్తర నానావిధాఘసంజాతహార్ద్ర దయాను సరణదృష్ట। మధ్యనాడీద్వార మార్గముక్త్యర్చి ప్రభృతిసత్కృతాండనిర్భేదతీర్ణ। సీమాంతసింధు సంక్షీణసూక్ష్మ శరీరశుద్ధసత్వప్రాప్తి శోభితాంగ। యుక్త లక్ష్మీశ కైంకర్య యోగజనిత। హర్ష మబ్బును నిహలోక మందు నరుల। కచ్యుతాసక్తశరజిద్ద మైకపాత్ర। లక్ష్మణాచార్య కరుణకు లక్ష్యమైన॥ ౧౮

తా॥ అనుకూలులతోడ సహవాసము సంసారమను దేహాత్మ వివరములేకయుండునది విడిచి యాచార్య సమాశ్రయణము గలిగి శ్రియఃపతికే శరణాగతినైన ప్రపత్తి గలిగి యనియు నానావిధములైన పూర్వోత్తర రాఘములగు పుణ్య పాపములు నష్టమై పోవుననియు నార్ద్ర పురుషుని కృపచేత సుషు

మ్నానాడి మార్గముతో త్రోవను బోయి దేహము విడిచి ధూమాది యర్చిరాది మార్గమున సకల దేవతలును బూజలు సేయఁగా బ్రహ్మాండము భేదించుకొని పోయి శ్రీ విరజాతీరము చేరుననియు నా విరజానదిఁ జొచ్చి తీర్థమాడఁగా సూక్ష్మ దేహము వీడిపోవుననియు దివ్యమైన శరీరమేను ధరియించి శుద్ధ సత్త్వమయమైన కల్యాణ గుణములతోఁ బరమపదముఁ జేరుననియు నిత్యసూరులఁగూడి శ్రియఃపతి కృపకు సర్వమైన పాపములు పోయి పాత్రుండౌనని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( సహవాసము వలనఁ బరమపదము గలదని యాన తిచ్చి మూఁడు సుకృతముల చేత శ్రియఃపతి కృపయుంచి రక్షించునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఈశ్వర సౌహార్ద్ర హేతు యాదృచ్ఛిక ప్రాసంగికాది సంభవితసుకృత। జాయమాన కటాక్ష సత్త్వ విద్యా ద్వేష మోక్షాభిముఖ్యాత్మ్యాలసుజన। సంభాషణాచార్య సంశ్రయణోద్భూత తత్త్వవిజ్ఞాన విధ్వస్తసకల। పూర్వోత్తరాఘ సంపూర్ణ భక్తివిరక్తి దుస్సహస్థితి పరిదూయమాన। చేతనప్రాప్య లక్ష్మీశ సేవదొరుకు। చతుర చతురక్షరీమంత్ర జప విధాన। మోక్షదాయక లక్ష్మణ మునివరేణ్య। కృపకులోనైన జనులకు గ్రిందుఁబడిన॥ ౧౯

తా॥ శ్రియఃపతి రక్షించుటకు హేతువులు మూఁడు సుకృతములనియు యాదృచ్ఛిక మనియుఁ బ్రాసంగిక మనియు ననుషంగిక మనియు నిందుఁ బుట్టిన సుకృతముచేఁబట్టి జాయమాన కటాక్షముంచుననియు నా కటాక్షము వలన సాత్త్విక లక్షణములు గలుగుననియు శ్రీవైష్ణవుల పట్ల ద్వేషములేక మోక్షమునకు నభిముఖమై యుండుననియు శ్రీవైష్ణవులతోడ సంభాషణము చేత నాచార్య సమాశ్రయణము గలిగెననియు నందు వలనఁ బరతత్త్వమైన శ్రియఃపతి శరణాగతి గలిగెననియు నందుచేతఁ బూర్వోత్తరాఘములైన పుణ్యపాపములఁ బాయుననియుఁ బూర్ణమైన భక్తివిరక్తులు గలిగెననియు నర్థకామ పరవశమైన శరీరస్థితికి సహింపఁ జాలక శ్రియఃపతి సన్నిధికిఁ జేరుటయె న్నడో యని పరమపదము జేరిన శ్రియఃపతి సేవదొరుకుననియు మహావివేకమైన నేర్పుచేతఁ జతురక్షరిమంత్రము జపముగా నను సంధించుచు నుండెడు నెవ్వెరుగనివారు. జీయరు మోక్షము నిచ్చెడి మునివరేణ్యుఁడైన స్వామి కృపకులోనైన మనుష్యులకు విఘ్నములు వచ్చినను నవితొలఁగి పరమపదముఁ బొందుదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( పూర్వసుకృతములు హేతువులుగా

రక్షించెడి విధము నానతిచ్చి శుద్ధ పామరులైన జనులకు వివేకములు గలుగఁజేసి ప్రాప్యదేశము చేర్చిరని మీఁద నానతిచ్చుచున్నారు.)

సీ॥ దేహంబు పాటించి ధృతిచెడి కామాది పరవశులైయున్న పామరులకు । వేదార్థ మెఱుఁగక విపరీత బుద్ధులై నారకులగుచున్న నాస్తికులకు । నేనునాదను మాట మాననేరక వృథా తత్త్వజ్ఞులగుచున్న తామసులకుఁ । నారాయణుఁడె సర్వకారణంబని లేక బద్ధులై చెడుచున్న పాతకులకు । మొదలుగాఁ దెల్విఁబుట్టించి మోక్షమార్గ । నిరతులుగఁజేసి వైరాగ్యనిధులఁ జేసి । విష్ణుదాసులుగాఁజేసె విమల యశుఁడు । లక్ష్మణార్యుండు లోకవిలక్షణుండు॥ ౨౦

తా॥ శరీరభోగములు మంచివని ధైర్యమువిడిచి కోరికలఁచేత బరవశులైయుండెడి పామరులకనియు వేదాంతార్థము నెఱుంగక విపరీతబుద్ధులచేత నరకాదులనుభవించెడి నాస్తికులకనియు నేను నాది యనుబుద్ధి మాననేరకయుండెడువృథాతత్త్వజ్ఞులగు తామసులకనియు నారాయణుఁడైన శ్రియఃపతిసర్వమైన కార్యములకును గారణవస్తువనిలేక కారణబద్ధులై యుండెడిచెడిన పాతకులకనియు వీరుమొదలైన వారికిఁ దెలివిఁబుట్టించి మోక్షమార్గమునకు నేర్పరులఁజేసిన నిర్మలమైన కీర్తిగలవెంబెరుమానారు జీయరః లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (బద్ధులైన యాత్మలను విశేషకటాక్షముచేతఁ బరమపదప్రాప్తులఁజేసిరని యానతిచ్చి పుణ్యపాపరూపమైన పూర్వమందుఁజేసిన కర్మముల స్వరూపము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పుణ్యపాపాత్మక పూర్వాఘమారబ్ధ సంచితాకారమై శాస్త్రసిద్ధ । మారబ్ధమనుమతానను తరూపమై వరుసతో జన్మప్రవర్తకంబు । బుద్ధిపూర్వాబుద్ధి పూర్వక సంజ్ఞలనుత్తరాఘంబును నుద్భవించు । నదియును సానుతాపానను తాపాద్య మాఘమీ పూర్వోత్తరాఘములను । ననుభవింపించి ప్రారబ్ధమన్యలందుఁ । బూర్వపుణ్యంబు పాపంబు బొందఁజేసి । చూడకుండెడు యనోర్చియు శుద్ధుఁజేసి । ముక్తుఁగాఁజేయు లక్ష్మణ మునివరుఁడు॥ ౨౧

తా॥ పుణ్యపాపరూపమైన పూర్వము చేసిన పాపములును నిప్పుడు చేసిన పాపములును నివితాను జేసి కూర్చఁబడిన కర్మములని శాస్త్రములు సిద్ధముగా జెప్పుచున్న వనియు నారబ్ధమైనది యెఱుకలేక చేసిన కర్మములును నెఱుకతోఁ జేసిన కర్మములును నీజన్మమునఁ జేసిన పాపములనియుఁ దనబుద్ధిపూర్వానసనలఁ గట్టుబడినది గనుక మునుపుకూడిన సంబంధమున నుత్తరాఘం

బుట్టునట్టియో నదియు ననుతాపమును ననుతాపము లేకపోవుటయును దాను సంపాదించిన వస్తువుల ననుభవించి యారబ్ధమును బోఁగొట్టి పూర్వోత్తరాఘములను గొంచె మనుభవింపించి పుణ్యపాపము లన్యుల యందుఁ బొందఁ జేసెనః యు నీచేతనుండు తన్నుఁ జూడకుండినను దాముచూచి వీని దర్శనములకు నోర్చి పరిశుద్ధుని జేసి ముక్తునిగాఁ జేసెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పూర్వోత్తర పుణ్యపాప స్వరూపమును నారబ్ధమైన యనుభవములను నానతిచ్చి శ్రియఃపతి యొక్క శేషత్వ పారతంత్ర్యాదులచేత నమరినచేత నుండు నడిచెడు ననుష్ఠానము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీశైక శేషత్వ సిద్ధస్వరూపులై తద్దాస్య రస సుఖ స్తబ్ధులగుచు। దత్సాధనంబును దత్సత్ఫ్లాపేయని చాతకస్థితి నన్యసంగముడిగి। యనుభవించుచున్న యాళ్వారి శ్రీపాదభక్తులైనట్టి శ్రీభాష్యకార। గుణములే కొని యాడు కూరేశ్వరాదుల మతినిల్పు రమ్యజామాతృయోగి। చరణములెకొల్చు లక్ష్మణార్యులెపుడుఁ। దలచుచుండెడి వారిని ధరణిలోన। నెఱిఁగి పూజించనేర్చిన నెన్నటికిని। వ్యాధి దుర్భిక్ష తస్కర వ్యథులులేవు॥ ౨౨

తా॥ శ్రియఃపతి శేషత్వ పారతంత్ర్యాదుల యందు స్వరూపములైన యాదాస్యమందు సుఖమైన బుచియందు మగ్నులై యుందు రసియు నత నికృపయే సాధనంబైన ఫలమనియుఁ జాతకపు పక్షివలె నన్యసంగతులుడిగి యెప్పుడును ననుభవించుచు నుండు రసియు వారెవ్వరనఁగా నాళ్వారుల యేక కంఠమైన నమ్మాళ్వారుల తిరువడిఘళయందు భక్తులైనట్టి యెంబెరుమానారు గుణములే యనుభవించెడి కూరత్తాళ్వారులు మొదలైన పూర్వాచార్యులను మనస్సు నందు నిలుపుకొని యనుభవించెడు పెరియజీయరు తిరువడిగళ నెప్పుడు మనస్సున నుంచుకొని కల్యాణ గుణములే యనుభవించుచున్న యెంబెరుమానారు జీయరును నీభూమిలో నెఱిఁగిన వారిని బూజింప నేర్చిన నా దేశమందున్న చేతనులకు నెన్నటికిని వ్యాధులును గరువులును బొంగ భయములును లేదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబునందుఁ బ్రాప్య నిష్కర్ష ప్రకరణంబును నత్యంత పరతంత్రులై భార్యాసములు నైన సకలాత్మలకు భర్తయు భోక్తయుఁ బురుషోత్తముం డనియును స్వరూపానురూపానుభవము స్వాంతరాత్మమై యానందమయ సంగమం బనియును పాయోపేయాంతర త్యాగ పురస్సరంబుగా భగవత్సన్నిధిని స్వదోషాను

సంధాన పూర్వక శరణాగతిఁ జేయించిన స్వాచార్యుని మఱువ రాదనియు నాత్మాపహరణ తత్సమర్పణంబు కన్న నెక్కుడైన పుణ్యపాపంబులు లేవనియును భక్తి ప్రపత్తులయం దనధికారికి భాష్యకారాను స్మృతియే మోక్ష సాధనంబనియును సంసారజలధిఁ గడచెడు ప్రకారంబును దేవతాచార్యభాగవత నిషూర్షయు స్వరూపాను రూపతదీయశేషత్వానురూప వృత్తిసిద్ధ్యర్థంబుగా భాష్యకారాను వర్తనంబు మంచి దనియు నల్పాస్థిరత్వాది దోషయుక్త కైవల్యైశ్వర్యాది సుఖంబులు రోసి భగవన్ముఖోల్లాస పురుషార్థసిద్ధికి భాగవతాను వర్తనంబె మంచిదనియును వైష్ణవ సంసర్గ గలిగి స్వనైచ్యాను గుణంబుగా వారికిష్టంబు చేసిన ముక్తసముండనియును శరణాగతాధ్యవసాయ క్రమంబును వస్తువాసి యెఱిఁగి ప్రపన్న సంసర్గ గలిగిన మంచిదనియును గర్మభేద కృత దేహంబులు చూడక జీవేశ్వర శరీర శరీరి భావజ్ఞానంబును స్వయత్న నివృత్తియే మోక్ష సాధనంబనియును సంహారాది దశల రక్షించెడువాఁడె రక్షకుండనియు వైష్ణవలక్షణంబును దదీయపర్యంత స్వరూపోపాయ పురుషార్థ విరోధుల హమ్మమతలనియు నతిప్రయాసోపదేశ రహస్యార్థంబులను సులభంబుగా నానతిచ్చిన ప్రకారంబును సకల సుఖవ్యావృత్త మిథునకైంకర్య సుఖైక సక్తయతిరాజాభిమానస మీచీన భావంబును స్వామి సంబంధమే మోక్ష సాధనంబనియును ఛామరాది జనులకు వైష్ణవత్వంబు గలిగించిన ప్రకారంబును లక్ష్మణముని సంబంధులఁ బూజించినవారికి వ్యాధ్యాద్యుపద్రవములు లేవనియు సకల పాపనివృత్తి ప్రకారంబును నన్నది నవమ ప్రకరణము.

శ్రీమదచ్యుత శఠకోప యతిరాజ వరవరముని నిజగురుభ్యోనమః.





శ్రీమతేరామానుజాయనమః.

## ము ము క్షు జ న క ల్ప క ము.

### దశమ ప్రకరణము.

ఎంబెరుమానారు జీయరు విగ్రహసంబంధ పూజ వలన వ్యాధులును దుర్భిక్షంబును ఘోర భయములును లేవని యానతిచ్చి యాయెంబెరుమానారు జీయరు నవతార వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ కుతలాంధ్రదేశము లుఱదురాఖ్య సద్గ్రామ సంజాత సింగ
రాచార్యశిష్య । జ్ఞాన భక్తి విరక్తి సంశ్రయాత్మాశ్రిత మోక్ష ప్రదాఖిల
మునివరేణ్య। భాష్యకారాంఘ్రి సద్భక్త కాంచీరంగ మధ్యకోవెలపుర మఠ
నివాస । ద్రావిడవేదార్థ తత్త్వాను సంధానయాపిత మార్గణ హర్ష పులకి
తాంగ వరవరకూరవరాది సకల। గురుజనప్రియ కల్యాణ గుణనిధాన। లక్ష్మ
ణాచార్య లోక విలక్షణార్య । సేవితాశేష సన్నుత శ్రీవిశాల॥ ౧

తా॥ ఈ భూమిలోఁ దెనుగు దేశమందు ముఱుదురని చెప్పఁబడిన గ్రామమందు నెంబెరుమానారు జీయరవతరించి యద్దంకి సింగరాచార్యులకు శిష్యులైరనియు జ్ఞానభక్తివిరక్తులు గలిగిన తన సకలాత్మలును నాశ్రయించ మోక్షము సమస్తమైన వారికి నిచ్చెడు మునిశ్రేష్ఠుండనియు శ్రీభాష్యకారుల తిరువడిగళయందు భక్తి తాత్పర్యాదులుగల వారలనియుఁ బెరుమాళ్ల కోవెలకును నంబెరుమాళ్ల కోవెలకును మధ్య ప్రదేశమందున్న తిరుకోవలూరిలోనున్న మఠములో నిత్యవాసముగా వేంచేసియుండెడు వారలనియు నమ్మాళ్వారు లానతిచ్చిన దివ్య ప్రబంధానుసంధానముల చేతఁ దిరుమేను పులకాంకితమైన యానందాతిశయముతో ననుభవించుచుండెడు వారలనియుఁ బెరియజీయరు కూరత్తాళ్వారులు మొదలైన పూర్వాచార్యుల తిరుకల్యాణ గుణములు నిత్యానుసంధానము చేయువారలనియు నెంబెరుమానారు జీయరు లోకములో విలక్షణమైన యాచార్యులనియు సకలమైన యాత్మల చేత

సేవింపఁ బడిన వారలనియు శ్రీవైష్ణవ శ్రీసమేతులని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరి యవతార వైభవమానతిచ్చి శత్రు వర్గంబుఁ బోనీక మిత్రవర్గంబు చేసుకొనెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీమదద్భుతభూత నామపురాధ్యక్ష రామానుజాంఘ్రిని స్సీమ కామ। యీషణత్రయబద్ధ పాషండ దుర్వాదివేష దుర్భాషా విశేష రోష। శ్రీభూసమాశ్లిష్ట వైభవ విద్వల్లబ్ధ సౌభాగ్య తత్సూక్తి లాభలోభ। దేహాద్యనాసక్తదోహాళకూరేశ మోహాససుగుణ సందోహ మోహ। దాస్యవైభవమద మోక్షదానవిపుల। మత్సరగ్రస్త లక్ష్మణ మానిచంద్ర। శత్రువర్గంబుఁ బోనీక చతురమతిని। మిత్రభావంబుఁ బొందింప మీకె తగును॥ ౨

తా॥ సకలసంపత్కరమైన శ్రీపెరుంబూదూరియం దవతరించిన శ్రీభాష్యకారుల చరణములయందుఁ గోరిక గలవారనియు సంసారబద్ధులైన పాషండులచేతఁ జెప్పఁబడిన తామస శాస్త్రములయందు రోషము గలవారనియు శ్రీభూనీళాది సేవితుఁడైన శ్రియఃపతి కల్యాణ గుణములలోఁ బరమ గుహ్యమైన కల్యాణ గుణముల యందు లోభత్వము గలవారనియు దేహాదులయందాసక్తిలేక పరిపూర్ణ మనోరథులైన కూరత్తాళ్వారు పెరియజీయరు మొదలైన యాచార్యులయందు మోహము గలవారలనియు దాస్యవైభవములైన కైంకర్యము లనెడి మదము గలవారలనియు మోక్ష మిచ్చెదనని వేంచేసిన మహాత్ముండుగనుక సకలాత్మలకును మోక్షమిచ్చి రక్షించుచున్నను మత్సరము గలవారనియుఁ బరవాదులైన యరిషడ్వర్గములను దత్త్వజ్ఞానముచేత బంధువులుగాఁ జేసుకొనిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (కామ క్రోధ లోభ మోహ మద మత్సరముల బంధువులుగాఁ జేసుకొనిరని యానతిచ్చి యతినీచుఁడనైన నన్ను శ్రియఃపతిని జేర్చునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అతినీచు నన్నుఁ దానన్య మొకటైన జూడక నాత్మేశ్వరుని జేర్తునని యెంచి। పంచ సంస్కార సంపన్నునిగాఁ జేసి యర్థపంచక తత్త్వ మానతిచ్చి। యల్పాస్థిర ప్రాభవాత్మ సుఖస్వార్థ పరమ పదాపేక్ష పారఁ దోలి। స్వేచ్ఛేష్టనియమిత స్థిర మోక్ష నరకములైనను ఫలమని యమరఁజెప్పి। కాచి రక్షించి దేహరక్షణముఁ జేసి। తానె యుపకారకుఁడు నయ్యుఁ దమయాతీంద్రు। బలిమి నుత్తారకుండగు వరుని నెట్లు। మఱువ వచ్చునె లక్ష్మణ మానివరుని॥ ౩

తా॥ అతినీచుఁడనైన నన్ను నితరమైన నేరములు చూడక శ్రియఃపతిని జేర్చునని చూచియుఁ బంచ సంస్కార సంపన్నునిగాఁ జేసి యర్థ పంచక

మానతిచ్చిరనియు నల్పమై యస్థిరమైన యాత్మ సుఖముఁ బుట్టించెడి వారి యందు రుచి విడిపింతురనియుఁ బరమ పదమునం దపేక్ష పొరదోలిరనియు శ్రియఃపతి యాజ్ఞచేత స్థిరమైన మోక్షమైనను నరకమైనను నదేఫలమని సమ్మతిగ నానతిచ్చిరనియు నీవిధముగాఁ గాచి రక్షించి, దేహ రణముఁ జేసిరనియుఁ దానె యుపకారకుండయ్యును దమ యతీంద్రుని బలిమివలన నుత్తారకుండై శ్రియఃపతికి సరిసైన యెంబెరుమానారు జీయరును మఱువ వచ్చునాయని యానతిచ్చిరి॥ ( అతికష్టులైన యాత్మలను స్వామి కాచి రక్షించిరని యానతిచ్చి తెనుఁగుదేశములో ములుకుదురనే గ్రామమం దవతరించి భూమిని సంచరించిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ జన్మించె నంధ్ర దేశంబులో ములుకుదురను నూరనే మహా ఘనుఁడుదయను । జని చూచి సద్బ్రహ్మ చర్యంబుతో దివ్య దేశంబులెల నే దేశికుండు। శ్రీరంగమున సన్యసించి తిరుకోవలూరిలోనుండెనే యుత్తముండు। జ్ఞానభక్తివిరక్తి సద్భావమెఱిఁగించె శిష్యులకెల్ల నేస్థిరయశుండు। ఆళువారును యతిరాజునవతరించి । చనిన విధమెల్లఁ జెప్పెనే యనఘమూర్తి। యట్టి లక్ష్మణ మునివరుం డాదరించి। కావకున్నను మాకొకగతియుఁ గలదె॥

తా॥ తెనుఁగు దేశములోన ములుకుదురనెడి గ్రామమం దవతరించి యేమహా ఘనుఁడు కృపచేత వేంచేసిరనియు బ్రహ్మచర్యాశ్రమముతోఁ డ దివ్యదేశములెల్లఁ దిరిగి సేవించి కటాక్షించిన యాచార్యుం డెవ్వఁడనియు శ్రీరంగమున సంచరించి సన్యాసముఁ బుచ్చుకొని తిరుకోవలూరిలో నున్న యేయుత్తముఁడనియు జ్ఞానభక్తివిరక్తి స్వరూపములను శిష్యులకెల్ల నెఱింగించిన యే స్థిరకీర్తిగల యతండనియు నమ్మాళ్వారులును నెంబెరుమానారును నవతరించి వేంచేసి యస్మదాదులఁ గాచిరని యానతిచ్చి శిష్యులకు సకల రహస్యములను నేయనఘమూర్తి యానతిచ్చెననియు నట్టి లక్ష్మణ మునివరుండు దాసుని నాదరించి కావకున్న దాసునికి నొకగతియుఁ గలదాయని యానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు జీయరవతారమై దివ్య దేశములు కటాక్షించి తిరుకోవలూరిలో వేంచేసి యస్మదాదులఁ గాచిరని యానతిచ్చి తమ శిష్యులకు సకల రహస్యము లానతిచ్చిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పంచ సంస్కార సంపత్తి కర్హులఁ జేసి తత్త్వ రహస్య పద్ధతులఁ దెలిపి । ద్రావిడ వేదార్థ తాత్పర్యములఁ జెప్పి యర్థపంచకబోధ మనురక్తిఁ జేసి। వచన భూషణ శాస్త్ర వైభవం బెఱిఁగించి వివిధరహస్యార్థ విధు

లఁజేసి । ప్రథమ మధ్యాంతిమ సర్వ నిష్ఠలఁ దెల్పి భక్తి యతిపతి యందె పాదుకొలిపి । పరమపదయోగ్యులుగఁజేసి పరమకృపను । శిష్యవర్గంబు రక్షించె సిరులమించి. । సకల లోక ప్రసిద్ధుఁడౌ స్వామియనఁగ। వెలసె లక్ష్మణ మునిమమ్ము విడువఁ డెఁక్కను॥ ౫

తా॥ పంచ సంస్కారము లాత్మకుఁ గలుగఁజేసి తత్త్వరహస్యముల నిలుకడ లానతిచ్చిరనియు ద్రావిడవేదార్థ తాత్పర్యములనానతిచ్చి యథార్థపంచక బోధ మమర నానతిచ్చిరనియు శ్రీవచన భూషణశాస్త్ర వైభవ మానతిచ్చి తత్కీర్తన రహస్యార్థ విదులఁ జేసిరనియుఁ బ్రథమమధ్యమచరమ పర్వముల నిష్ఠలానతిచ్చి భక్తి యెంబెరుమానారు నందు సకలాత్మలకును గలుగం జేసిరనియుఁ బరమ పదమునకు యోగ్యులుగఁజేసి పరమకృపను శిష్యవర్గంబుల రక్షించి సంపదల మించిరనియు సర్వలోకములకుఁ బ్రసిద్ధుఁడైన స్వామియనఁగ వెలసెననియు నట్టి యెంబెరుమానారు జీయరు దాసుని విడువరింక నని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు జీయరు సర్వ రహస్యార్థములను శిష్యుల కానతిచ్చిరని యానతిచ్చి ఖ్యాతిలాభాదులు లేక యాత్మల నీడేర్చునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఖ్యాతి లాభార్చన ప్రీతి యుంచుక లేదు ఆత్మల నీడేర్చు నప్పుడు తనకుఁ । కులవృత్తి విద్యాది కొదువలఁజూడండు అదిముఖ్యమైచూచి యాదరించు । శిష్యులుగానని చింతింపఁ డెన్నఁడు సద్బ్రహ్మచారుల స్వాములనుచుఁ । దన్నువిడిచినవారైనఁ దా విడువఁ డెన్నఁడు ఆత్మనశించునో యనుచుఁ దయను । బరులదోషంబు లోక ప్రపంచమైనఁ । దనగుణంబులె కాని యాతని చరిత్ర । మరసిచూచిన యతిరాజో హరియొకాని। యొఱుఁగఁ గాఁడనె లక్ష్మణ యోగివరుఁడు॥ ౬

తా॥ ఆత్మల నీడేర్చు నప్పుడు ఖ్యాతిలాభ పూజల మీఁది యాశయించుక లేక యీడేర్చుననియుఁ గులమువలన నడతలవలన విద్యలవలన వచ్చెడి కొదువలు చూడండు తను తిరువడిగళకభిముఖమైనదే చాలు ననియు నాదరించి తమశిష్యులు తమకు సేవలుచేసినను శిష్యులుగారు వీరు బ్రహ్మోపస్థాపకులైన స్వాములందు రనియుఁ దమ్ముఁ జేకనుల విడిచినను దాము విడువరనియు నాయాత్మ యెక్కడఁ జెడిపోవునో యను కృపచేతఁ గాపాడుదు రనియు బరుల దోషములు బహుళముగా లోకములోన మించినప్పటికిని దమ మనస్సున నెంచక రక్షింతురనియు నిమ్మహాత్ముని చరిత్రములు చూచి యెంబెరుమా

నారా శ్రియఃపతి మే కాని మఱియొకండు కాడని; లక్ష్మణార్య లానతిచ్చి రి॥ (ఖ్యాతిలాభాదులు చూడక రక్షింతురని యానతిచ్చి సౌశీల్య వాత్సల్య సౌలభ్య గుణములు స్వామికిఁ గలవని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ సౌశీల్య వాత్సల్య సౌలభ్య మార్దవ జ్ఞాన భక్తి ప్రభృతి సద్గుణ ముల । బాలమూక జడాంధ బధిరాద్య యోగ్యుల సభిమానమునఁ గాచు నట్టి దయను । నొకరి కొకరికిఁ జెప్ప యోగ్యమైన రహస్య సంప్రదాయము మాకుఁ జాటుకతన । నెంబెరుమానారె యెంబెరుమానారు జీయరైనారని చెప్పవచ్చు । నాఁడె యెంబెరుమానారు నరులకెల్ల । శ్రీశ భక్తి ప్రపత్తులఁ జెప్పఁగానఁ। దామిరక్షకులని చెప్పఁదలఁచియెపుడు। సిద్ధ మెంబెరుమానారు జీయరౌట॥ ౭

తా॥ సౌశీల్య గుణములును వాత్సల్యగుణములును సౌలభ్యగుణములును మార్దవ గుణములును వీనితోఁగూడి విజ్ఞాన భక్తులు మొదలైన గుణములుగల వారనియు బాలకులను మూగలను జడులను నంధులను బధిరులను వీరు మొదలైన యయోగ్యులను కృపచేతఁ గాతురనియుఁ బూర్వులొకరి కొకరికిఁ జెప్ప యోగ్యమైన రహస్య సంప్రదాయముల నస్మదాదులకు నానతిచ్చిరనియు నా యెంబెరుమానారె యెంబెరుమానారు జీయరైనారని చెప్పవచ్చుననియు నాఁడె యెంబెరుమానారు నరులకెల్లను శ్రియఃపతి భక్తి ప్రపత్తుల నానతిచ్చిరి గాన నా యెంబెరుమానారె రక్షకులని చెప్పఁదలఁచినది సిద్ధమాయెను నా యెంబెరుమానారు జీయరౌటయని లక్ష్మణార్యులానతిచ్చి రి॥ (యెంబెరుమానారె యెంబెరుమానారు జీయరాయెనని యానతిచ్చి సార తరమైన తత్త్వమును మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ సారతమాభీష్ట సారార్థ మెఱిఁగించు తత్త్వమే దయకొని తన్మనముగ । హితమేదకొనుచు నేది పూర్వులు తమ కానతిచ్చిరి యడి దె యానతిచ్చుఁ । బురుషార్థ మేదకో ప్రాసంగిక విఘ్న దాస్యమేయని పలుకఁ దాఁచలేక । యెత ద్విరోధి తానే దయనేను నాయదియను కొన్న నాఁ టచుండి । వచ్చైనదిపోయి నప్పును మెచ్చియిచ్చు । నచ్యుతుండాత్మ పదము ని యానతిచ్చు । మోక్షమందుల రుచి గల్గి మోసపోక । యడుగ నేర్చిన మా లక్ష్మణార్యు లిపుడు॥ ౮

తా॥ సారతమమైన యర్థము తత్త్వమేదకొనుని యడిగినవారికి నా సారతరమే మేనని యానతిత్తునని యును హితమేదని యడిగినఁ బూర్వులు తమ కాన

ఇచ్చిన విధమే యానతిత్తు రనియుఁ బురుషార్థ మేదకోయని యడిగిన శ్రియః
పతి దాస్యమేయని దాఁచక యానతిత్తురనియు నిందుకు విరోధు లేకోయని
న నేను నాది యను గుణములు మానవలెననియు నీ దుర్గుణంబులు పోయినప్పు
డే మెచ్చియిచ్చును శ్రియఃపతి పరమపదమనియానతిత్తురనియు మోక్షమందు
రుచి గలిగిన వారు మోసపోక యడుగ నేర్చిన వారు మామెంబెరుమానారు
జీయరే యని యానతిచ్చి రక్షింతురని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (ఎంబెరు
మానారు జీయరు తమ్మెవ్వరేని పరమార్థము లడిగిన దాఁచక పరమార్థము
సాధించిరని యానతిచ్చి జ్ఞానులైన యాత్మలను సజ్ఞానము మీఁదఁ బెట్టుకొని
వారి యజ్ఞానము చెరుచునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అజ్ఞానమున వీరి యజ్ఞాన ముడిగించు విజ్ఞానమొందెడి విధముఁ
జెప్పుఁ। బట్టువిడుపులు దెల్పి పట్టించివిడిపించుఁ బట్టి నాతని బాపుఁ బక్కమె
త్తెఁగి। సుఖదుఃఖసాధన శోధన బోధించు సుఖములోపలనున్న సుఖముఁ దె
లుపు। అవనికిఁ దొలఁగించు నాత్మేశుఁ గనిపించు భయముఁ బాపెడువాని ద
యయుఁ జూపు। నాత్మరక్షణమునకు నైయవతరించి। యాధిమ ఖ్యాఁబు ఘట్టఁ
దా ననుసరించి। కాతుననియెడి తెలఁపునఁ గరుణ యుంచి। దేవుఁ డాతఁడె
లక్ష్మణ దేశికుఁడు॥ ౯

తా॥ దేహమే యాత్మయనియు దేహసంబంధులైనవారే రక్షకులనియు
నర్థకామాదులే పురుషార్థమని యుండెడు నజ్ఞానములుగల మూఢులు త
మ్ము సేవించ వచ్చిన వారికిష్టమైన సాధనములనే తాముబోధించి యారోగ్య
క్షేమాదులనే యడుగ నవధరించి హానిగలిగనేని దుఃఖమును లాభము గలి
గనేని సుఖమును గలిగి తమదిగా మనస్సున నుందురనియు వారికి సజ్ఞానము
పోయి ఇతఁడె దైవమని భ్రమలు విడిచి హితవడిగిన జ్ఞానోదయ ముపదేశము
చేతురనియుఁ బట్టు విడుపులు రెండును నానతిచ్చి పట్టించి విడిపింతురనియుఁ
జేతనుని పక్క మొత్తఁగి పట్టిన యతనిని జూపుననియు సుఖములకు మొదలైన
పుణ్యపాపముల సాధనములవిచారించికారాదని సుఖముబరమాత్మయందని దుః
ఖము చేతనుండని బోధించుననియు సకలమైన దుఃఖములలో సుఖము కైవల్యము
అసుఖము కారాదనియు నాసుఖము లోపలనె శ్రియఃపతి పరమపద బ్రహ్మా
నంద సుఖమును నానతిత్తురనియు నీయాత్మ కొదువలు పోఁగొట్టి యాత్మకుఁ
గర్తయైన శ్రియఃపతిని గనుపింతురనియు నభయ మిచ్చిన వారియొక్క కృపను
నానతిచ్చుననియు నాత్మ సంరక్షణార్థంబుగా నవతరించి రనియుఁ దనకు

నభిముఖులైనప్పుడే తాము వెంటఁ దగిలి కాతురనియు హృదయమందుఁ గృప యుంచి రక్షించిన దేవదేవుం డెంబెరుమానారు జీయరని లక్ష్మణాచార్యు లానతిచ్చిరి॥ (ఆత్మ సంరక్షణార్థమై యవతరించిన యెంబెరుమానారు జీయరు తమకునభిముఖులైన యాత్మల్లను రక్షించెనని యానతిచ్చి తిరుకోవలూరనినఁ బాపములు పారిపోవునని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తిరుకోవలూరికిఁ దెరు వేదకోయనఁ బాప సంఘములెల్లఁ బారఁ జూచు। మఱచైన యెంబెరుమానారు జీయరె యని నంత సంసార మలమటించు। ముగమున లక్ష్మణమునిఁ జూడ నెన్నఁడు గలుగునన్నను గలి కళవళించు। మాస్వామి వీఁడకో మాకేమిభయమన్న నచ్యుతుం డప్పుడే యభయమిచ్చు। నాశ్రయించిన నిత్యులు ననుసరింతు। రిష్ట కైంకర్యపరుఁడైన నిహముదాను। మోక్ష సుఖమబ్బు నే మహాత్మునకు సరియె। లక్ష్మణాచార్యుఁడు లోకవిలక్షణుండు॥

తా॥ తిరుకోవలూరుకుఁ బోయెడు మార్గ మేదని యడుగఁ గాఁ బాపసంఘములెల్లఁ బారిపోవుననియు మఱచినైనను నెంబెరుమానారు జీయరే యనునంతట సంసార మలమటించుననియు సంతోషముతో స్వామిని యెన్నఁడు చూడ గలుగునో యన్నను గలిదోషము కళవళ పడిపోవుననియు దాసుని నేలిన స్వామి యున్నాఁడు నాకేమి భయమని పలికినంతటనే శ్రియఃపతి యభయ మిచ్చుననియుఁ దమ్ము నాత్మ లాశ్రయించి నప్పుడే నిత్యసూరులు తమ వారని యనుసరింతురనియు నట్టి స్వామికి నిష్టమయిన కైంకర్యములఁ జేసిన వారికి నిహపరాములను సుఖమోక్షము లబ్బుననియు నా మహాత్మునికి సరి లేఁడని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (యెంబెరుమానారు జీయరి హృదయమునకు సరిపోయినవారికి నిహపరాదులును గలవని యానతిచ్చి ప్రతికూలులై యుండిన యాత్మల ననుకూలులుగాఁ జేసిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ప్రతికూలులై విష్ణు భక్తులు గాకున్న నానుకూల్యము పుట్టి యనుసరించు। ననుకూలులై తమ యండనుండినఁ జాలు మరపించు దేహ సంబంధి జనుల। దూరస్థులై సేవదొరకునో యనఁగలలోన నప్పుడు గానవచ్చు। జ్ఞాన భక్తివిరక్తి సంపన్నులుగఁ జేయు ముద్రలు భుజముల మోచినపుడె। యీక్షణ ధ్యానసంస్పర్శలిచటఁ జేసి। వీరు కాచిన జనులకు వెరపుగలదె। భాష్యకారులో యనుకుల భక్త దానో। లక్ష్మణాచార్యుఁడో లోక విలక్షణుండు॥ ౧౧

తా॥ ప్రతికూలులై విష్ణు భక్తులు గాకయుండెడు వాత్మల ననుకూలు

లుగాఁ గృపాజాతురనియు ననుకూలులై తమసన్నిధిని నుండినఁజాలునని దేహసంబంధులనురక్షించుననియు దూరదేశములనున్న యాత్మకోట్లీమహాత్ముని సేవదొరుకదు గదాయని విచారపరులై యుండెడిచేతనుల స్వప్నమందు వేంచేసి విగ్రహసేవగనుపింతురనియు నీస్వామి శ్రీహస్తమున భగవత్సంబంధమైనప్పుడే జ్ఞానభక్తివిరక్తులు పూర్ణముగాఁ గలిగియుందురనియుఁ దిరునయనములను జూచుటచేతను మనస్సునధ్యానించుటచేతను శ్రీహస్తస్పర్శలచేతను నీయాత్మకోట్లను గటాక్షింతురనియు నీమహాత్ముఁడు కాచిన జనులకు నేరము లేదనియు వీరు శ్రీభాష్యకారులో శ్రీయతిపతియో కాక మఱియొకరు కారెంబెరుమానారు జీయరేయని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరీక్షణ ధ్యాన సంస్పర్శలచేత నాత్మలనురక్షించిరనియానతిచ్చి యిట్టిస్వామిని నెప్పుడు గొనియాడెడు పెద్దలకు నేను దాసుండననిమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తిరుకోవలూరిమాదేశికుఁగొనియాడువారికి నెపుడు సేవకుఁడ నేను। మదిలోన నెంబెరుమానారుజీయరి శుభముఁగోరెడువారిసొమ్ము నేను। మరిగిలక్ష్మణయోగిమంగళాశాసనపరులైనవారి సంబంధి నేను। యతిరాజుగుణములే యనుభవించెడుస్వామిఁ బాయకుండెడువారిబంట నేను। ననుచుఁగరణత్రయంబుననమరువారి। కాత్మసంరక్షణార్థమై యరయఁదగిన। దొకటియును లేదు తెలిసిననుభయలోక। మాన్యులైయుందురిది శాస్త్రమర్మమిపుడు॥ ౧౨

తా॥ తిరుకోవలూరి యెంబెరుమానారు జీయరును గొనియాడువారికి సేవకుండ నేననియు మనస్సులోన నెంబెరుమానారుజీయరు మేలుగోరెడు వారికి సొమ్ము నేననియు లక్ష్మణయోగియైన స్వామికి మంగళాశాసనము చేసినవారి సంబంధుఁడ నేననియు నెంబెరుమానారు గుణములే యనుభవించెడిస్వామిని బాయకుండెడు వారిబంట నేననియు ననుచుఁ ద్రికరణశుద్ధిగ నమ్మినవారికి నాత్మసంరక్షణార్థమై యెఱుఁగఁదగినది యొకటిలేదని తెలిసినవారు నిత్యవిభూతి లీలావిభూతులయందుఁ బూజ్యులైయుందురిది శాస్త్రసమ్మత మిప్పుడని లక్ష్మణార్యులానతిచ్చిరి ॥ (ఎంబెరుమానారు జీయరుకు మంగళాశాసనముఁ జేసెడువారికి దాసుండ నేనని యానతిచ్చి సకలాత్ములకును దెలియునటుల సకలార్థము లొకటిచేసి తెలియునట్లు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీమంతులిలమంచి చెరువులు ద్రవ్వించి జలమునిండించనా జలములోన । స్నానపానాదులు జరుపుచుఁగొందఱు ముదమందఁగొందఱు మునిఁగినట్లు । ప్రజలచీఁకటివాయఁబంజుముట్టించినఁ గొందఱావెలుఁగునఁ గొదువఁదీర । జారచోరులకది యసహ్యమైమఱికొన్ని జంతువులందులోఁ సమసినట్లు । లక్ష్మణార్యులలోకవిలక్షణులుగ । జగతిఁబుట్టించె శ్రీహరిజనులదిద్ద । బ్రతికికొందఱు యతిపతిప్రవణులైరి । కొందఱల్పులు దూషించి కుమతులైరి॥ ౧౩

తా॥ ఐశ్వర్యసంపదలతోడనుండెడి రాజులు నీళ్లులేనిదిక్కులఁ జెఱువులఁద్రవ్వించి యాచెఱువులోజలము నిండించిన నాజలములోపల స్నానపానాదులు జరుపుచును గొందఱు దురనియు మఱికొందఱా జలములో మునిఁగి శరీరములు విడుతురనియుఁ బ్రజలచీఁకటి పాయుటకుఁ బంజుముట్టించినఁ గొందఱావెలుఁగునఁ గొదువలు దీరితమతమ నెలవులకు సుఖముగాఁబోదురనియు మఱికొందఱుజారులకును జోరులకును నసహ్యమైయుండుననియు మఱి కొన్నిజంతువులావెలుంగులోఁబడి సమసిపోయెననియు శ్రీయతిపతి యెంబెరుమానారు జీయరును విలక్షణమైన విగ్రహము గలవారినిగా లోకములోని యాత్మలఁగడ తేర్పఁ బుట్టించిరనియుఁ గొందఱెంబెరుమానారు దాసులకుఁ బ్రవణులైరనియు మఱికొంద అల్పులుదూషించి కుమతులైరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరుమహిమ లెఱిఁగి కొందఱుకడతేరిరి కొందఱుదూషించి చెడిరని యానతిచ్చి యాళ్వారు ఘళునయనారులను శైవులుపరిభవించునది మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఒక్కపాదముఁద్రొక్కియున్నాఁడు మీదేవుఁడిక్కడ రెంటికి నెడములేదు । తక్కినచోట్లెల్లఁదమదని పాషండు లాక్రమించినవేళ నరుగుదెంచి । మొక్కలంబీ సేఁతమునుపటి యెల్లలకెక్కుఁడుపోనిను నేనటంచు । నొక్కఁడుతిరుకోవలూరలక్ష్మణయోగి చక్రినియెల్లకుసాక్షి దెలిపి । యెల్లజనులును రాజులు నెఱుఁగనుంచి । యెల్లకరమంటపంబులు నిరులుగవియు । తోఁపులునుగోపురంబులు తొల్లిటట్ల । తానెకలిగించెనా చంద్రతారకముగ॥ ౧౪

తా॥ కీభూరి శైవులు శ్రీవైష్ణవులతోడఁ బరిభవించెడుమాటలు మీదే
వునిఁబాదము మోపుటకు నెడములేక యొక్క పాదమునుమోపి యొక్క

పాదముమీఁదికిఁ జాఁచినాఁడనియుఁ దక్కినచోటు తమదని పాపండు లాక్రమించినవేళ వేంచేసిరనియు ముష్కరములేల మునుపటి యట్లక్రమముగామించిపో నినునేననియుఁ దానునొక్కఁడు తిరుక్కోలూవరి లక్ష్మణయోగియయిన యెంబెరుమానారు జీయరెల్లకు సాతులుపలికించిరనియు సమస్తజనులురాజులును నెఱుఁగునట్లెల్ల కరగట్టించిరనియు మంటపంబులును జీఁకటిఁబుట్టించుతోఁపులును గోపురంబులును దొల్లిటియట్ల తామెకలిగించిరనియు నెప్పటికిని నాచంద్రార్కముగ నిలుచునట్లుచేసిరనియు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు ఆళ్వారుఘుళునయనారులకు నెల్లకర గోపురమంటపంబులు గోపురంబులు మొదలైనవి కావించిరనియానతిచ్చి మృకండుఁడనుఋషికిని మొదలాళ్వారులకును బెరుమాళ్లుప్రత్యక్షమైనవిధముమీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ దేవేంద్రునికి జగత్త్రితయంబు బలివేఁడివంచించి యిచ్చినవామ
నుండు । శ్రీపాదమాతని శిరసునఁబెట్టిన వార్తదావినితొల్లి వనధిలోనఁ ।
దపముచేయుమృకండుఁడు పరతుండైవచ్చి తిరుకోవలూరును తిరుపతందు ।
నచ్యుతునాజ్ఞనేయన్నదానముఁజేయు హరియునునాతనియడఘుళందు। ము
నుపువచ్చిన్న యాళ్వార్లు ముగ్గురికిని । నామృకండునికొఱకునై యురు
గుదెంచి । చూపెనశ్చాత్రివిక్రమరూపమునుచు । నానతిత్తురు మాలక్ష్మ
ణార్యులెపుడు॥ ౧౫

తా॥ దేవేంద్రునికొఱకై మూఁడులోకములును బలిచక్రవర్తిని వేఁడికొనివంచించి యిచ్చినవామనుండై యవతారమాయెననియు నాబలిచక్రవర్తిశిరసున వామనావతారుఁడు శ్రీపాదము మోపెనని వార్తవిని తొల్లి మృకండుఁడను ఋషిసముద్రములోఁ దపముచేసెననియు నారదునివలనవిని పరతంత్రుఁడై వచ్చి తిరుకోవలూరనెడు తిరుపతియందు శ్రియఃపతియాజ్ఞచేతనన్నదానము చేయుచుండెననియు శ్రియఃపతియతని యడఘుళియందు ముందుగా వేంచేసిన పొయిగపూదత్త పేయాళ్వారులు ముగ్గురికిని నామృకండునికొఱకును వేంచేసి త్రివిక్రమరూపమునఁ బ్రత్యక్షమైనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( మొదలాళ్వారులకును మృకండునికిని నాళ్వారుఘుళునయనారు పెరాట్టితోఁగూడఁ బ్రత్యక్షమైరని యానతిచ్చి తిరుకోవలూరి స్థలవైభవములును నందలి విశేషములును మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఆయనాళ్వారుఘుళ్ నాయనారను పేళు కృష్ణత్రివిక్రమాకృతులు హరికి । నూరనువనమునందున్న దేవుఁడు నదీక్షేత్రంబుకృష్ణాఖ్యఁజెందునిచట । శంఖగాలవచక్ర సంజ్ఞాదితీర్థసంపదలు తొమ్మిదిశుభప్రదములిచట । జనులెల్లఁబంచ యోజనమాత్రమెక్కడ సమసినము క్తులైచనుదురిచట । యిచటికడియనిరప్పించి యీమహాత్ముఁ । డఖిలకైంకర్యములు గొనననవధరించెఁ । గరుణనడియనిఁబాయ కిక్కడనెనిలిపె । ననుచులక్ష్మణమునివరుండానతిచ్చు॥ ౧౬

తా॥ ఆయనారాళ్వారుఘుళ్ నయనారనెడి తిరునామములు గలిగిన కృష్ణుండు త్రివిక్రముండనియెడి తిరునామములుగల పెరుమాళ్ళునియునూరనునడవియందును వేంచేసియున్న పెరుమాళ్ళు నదిక్షేత్రము ఈయుయిదను గృష్ణుని తిరునామముచేతఁ జెప్పఁబడియుండుననియు శంఖగాలవచక్రాదితీర్థములు శుభములిచ్చునవి తొమ్మిదిగలవనియుఁ జుట్టును నయిదు యోజనములలోపల నేజాతి వారైనను శరీరములువిడిచిరేని ముక్తులాదురనియు నట్టి తిరుక్కోవలూరిలోనిస్వామి దాసుని రప్పించిరనియుఁ నఖిలకైంకర్యములు గొననవధరించిరనియుఁ గృపచేత దాసునిదమ్మునెడబాయకుండ నిచ్చటనే నిలిపిరని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( తిరుక్కోవలూరి వైభవమానతిచ్చి స్వామియవతారమును దిరునక్షత్రమునుమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీముఖవత్సర స్థిరపుష్యమృగశిర సంధిదేశంబులో నవతరించె । శ్రీమంతుఁదిరుమల సింగరాచార్యుల నద్దంకిలోపలనాశ్రయించె । దివ్యదేశంబులు దేజరిల్లఁగఁజేసి నిజవైష్ణవస్థితి నిర్వహించెఁ । దిరుక్కోవలూరిలోఁ దేశంబుతోనుండి శిష్యులకునుదత్వశిక్షఁజేసెఁ । బరమభక్తియుతీంద్రసంస్మరణపుష్టి । విభవసంవత్సరాషాఢవిద్యమాన । బహుళపక్షచతుర్దశిభాష్యకారు । ముదముతోఁజేరెలక్ష్మణమునివరుండు॥ ౧౭

తా॥ శ్రీముఖ సంవత్సరమందుఁ బుష్యమాసంబున మృగశిర నక్షత్రమందుఁ దెనుఁగుదేశమందు నవతరించిరనియు శ్రీమంతుఁడైన తిరుమలసింగరాచార్యులను నద్దంకిలోపలనాశ్రయించిరనియు దివ్యదేశంబులు ప్రకాశించునట్లొనర్చి తమమతములును దమముద్రలును నిలిపిరనియు శ్రీవైష్ణవస్థితి నిర్వహించిరనియుఁ దిరుక్కోవలూరిలోఁ దేశంబుతోనుండి తమశిష్యులకుఁ దత్వశిక్షచేసిరనియుఁ బరమమైనభక్తిచేత నెంబెరుమానారుతిరువడి

గళను సంస్మరించుచున్న హృదయముగలవారనియు విభవసంవత్సరమం
దు నాషాఢమాసమున బహుళపక్షచతుర్దశిని నెంబెరుమానారు తిరువడిగ
ళుచేరిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరు అవతార
మును వారివైభవమునునానతిచ్చి వారుపరమపదమునకు వేంచేసినది మీఁద
నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శకవత్సరంబులు చనినవి వేయును నన్నూట తొంబదినాఁటివిభవ ।
కర్కాటకాషాఢగామిసితేతర పక్షచతుర్థినిభాష్యకార । పదపద్మసేవ్యభక్తి
పరమమైమించిన మౌనవ్రతస్థుఁడై మనసునిలిపి । దివ్యదేశంబగు తిరుకోవ
లూరిలో మఠములో నైహికమతములుడిగి । సౌమ్యవర యోగి సింగరాచా
ర్యకూర । వరులఁ దలఁచుచుఁ దిరుమేనువదలి బ్రహ్మ । రంధ్రమునఁ బోయి
యతికులరాజుఁ జేరె । లక్ష్మణార్యుండు లోకవిలక్షణుండు॥ ౧౮

తా॥ శాలివాహనశక సంవత్సరములు వేయిన్నూట తొంబది చెల్లిన
మీఁద విభవసంవత్సరాషాఢమాసమునఁ గృష్ణపక్ష చతుర్దశినాఁ డెంబెరు
మానారుపాదపద్మములు దమమనస్సున నుంచుకొనిరనియు మౌనవ్రతులు
లై మనసునిలిపిరనియు దివ్యదేశమైన తిరుకోవలూరి మఠములో నైహిక
మమతలువిడిచిరనియుఁ బెరియజీయరును దమయాచార్యులను గూరత్తా
ళ్వారులను మనసులోఁ దలంచుచుఁ దిరుమేనువదలి బ్రహ్మరంధ్రమున వెడ
లి తామెంబెరుమానారు తిరువడిగళుఁ జేరిరనియు నెంబెరుమానారుజీయ
రుభయ విభూతులకు విలక్షణమైన విగ్రహముగలవారని లక్ష్మణార్యులా
నతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరుపరమపదమునకు వేంచేసిన వైభ
వమానతిచ్చి వారిదివ్యమంగళవిగ్రహానుభవము నుమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చిన్నారిపదయుగ శ్రీముఁదు సేవించి పిక్కల పైదృష్టి పెట్టుకొనుచుఁ ।
దొడలును బిరుదును దోఁచకుండఁగఁ గప్పి కట్టినకాషాయ కాంతిఁ గనుచు ।
నుదరంబు నాభియు నొప్పుడు వళులును నుపవీతయుతమైన యురము జూచి । యు
త్తరీయము మీఁద నొప్పు సెప తిరుమణి వడము త్రిదండయు గ్రావమకరము । చింతి
తార్థములిచ్చు దక్షిణకరంబు । నవ్వుమోమును దిరుమణిని యునత్యుగము । శి
ఖయు సేవించి చుట్టును సేవఁ జేసి । మనసులోపల లక్ష్మణ మౌనిఁ దలఁతు॥ ౧౯

తా॥ చిన్నలై ముద్దులై నిండారుఁబగానున్న తిరువడిత్తామరలును నం
దకువందములైన పిక్కలును నందుకుఁ దగినతొడలును బిరుదులును దోఁ
చకుండఁ జాతుకొనిన కాషాయ కాంతిఁ గనుచున్న బంగారు కుండపుఁటి

బొజ్జయును నాబొజ్జకుఁదగిన నాభియు నందమైన బొజ్జకునమరిన వళులును నుపవీతమును విస్తారమైనవక్షస్థలమును జూచియు గావియుత్తరీయముమీఁదనొరసెడి తిరుమణివడములును నెడమశ్రీహస్తమునఁ బట్టిన త్రిదండమును దమశిష్యులుగోరిన కోరికలుప్రసాదించెడి కుడిశ్రీహస్తమును నవ్వులుగల తిరుముఖమండలమును వెడల్పులై చల్లనైన కటాక్షములుగల తిరునయనములును జిన్నిశిఖగల స్వామిచుట్టును సేవించియు దాసుని మనస్సులోపల నెంబెరుమానారు జీయరునుదలంచుకొందుమని లక్ష్మణమునివర్యులానతిచ్చిరి॥ ( స్వామివిగ్రహాకారమును వర్ణించియానతిచ్చి యద్దంకిసింగరాచార్యుల సన్నిధిని రహస్యార్థములు విన నవధరించిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సింగరాచార్యులు చెప్ప నెఱిఁగినయర్థ మాత్తాను చెప్పినయోగమార్థ । మాటమున్నకందాళ యణ్ణగారికిశిష్యులైనజీయరుచెప్పి నట్టియర్థ । మటువలెనేస్వప్న మందుఁదానే పెరియ జీయరుకృపచేసి చెప్పినర్థ । మామీఁదఁదాబుద్ధి నరసిపూర్వులనడత లందువలననుగన్న యర్థమదియుఁ । గూర్చుకొనివచ్చినూవల్లఁ గొదువచూడ । కానతిచ్చిగురువరుననఘమూర్తి । నుత్తమోత్తములక్ష్మణ యోగివరుని । మనసులోపలనెటువలెమఱువవచ్చు॥ ౨౦

తా॥ అద్దంకి సింగరాచార్యుల సన్నిధినివిన నవధరించిన రహస్యార్థములును దిరునగరియందునా త్తానుసన్నిధిని లభించిన యోగమార్గములును నంతకుముందు శ్రీరంగమందుఁ గందాడయణ్ణగారికి శిష్యులైన జీయరుసన్నిధిని దెలిసినయర్థములును దమస్వప్నమందుఁ బెరియజీయరువేంచేసి కృపచేత నానతిచ్చిన యర్థములును నామీఁద దాము మనస్సునఁ బూర్వులనడతవలనఁ గనినయర్థములును, నిందఱి యాచార్య పురుషులవలన వచ్చిన పరమార్థములును దాసునివలనఁ గొదువలుచూడక ప్రసాదించి మునిశ్రేష్ఠుండైన యెంబెరుమానారుజీయరు దివ్యమంగళ విగ్రహముయొక్క స్ఫూర్తిని నుత్తమపురుషులలోపల నుత్తముండైన స్వామిని దాసునిమనస్సులోనెటువలె మఱువవచ్చునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సకలరహస్యార్థములు తమయాచార్యులు మొదలైన పెద్దలవలనలభించి కూర్చినపరమార్థములను దాసునికిఁ బ్రసాదించిరని యానతిచ్చి సకలవేదాంత సూక్ష్మార్థములను మీఁద నానతిచ్చుచున్నారు॥).

సీ॥ అఖిలవేదాంత సూత్రాత్మకారమంత్రార్థ సారవత్ప్రదనాచార్యుఁడి
తఁడె । యజ్ఞానతిమిరంబు నడఁచె నాశ్రితదోష గుణహానులరయనీ గురు
వితండే । దివ్య.దేశాదర స్థితికృదీశగభీర చిత్తజ్ఞుఁడైన దేశికుఁడితండె
బాలమూగజడాంధ బధిరాదిలక్షణ జ్ఞానశక్తిజ్వల స్వామియితఁడె । తప్ప
దాభాష్యకారావతారమను చుఁ । బరమపథమందు స్వస్వరూపములభిం
చ । వచ్చివచ్చిముముక్షులీ వసుధలోన । లక్ష్మణాచార్యకరుణకు ల
క్ష్యమయిరి॥ ౨౧

తా॥ సకలవేదాంతములయందును సూత్రాత్మకారంబుగా నున్న మంత్ర
మందర్థసారమును బ్రసాదించెడు సదాచార్యుండితండేయనియు నజ్ఞానాం
ధకారముఁబోఁగొట్టి యాశ్రయించినవారి దోషగుణహానులను జూడకర
క్షించెడి గురుండితండెయనియు దివ్యదేశములయందు నాదరమును శ్రీ
యఃపతి గంభీరగుణములను మనస్సుననుంచుకొన్న యాచార్యుఁడితండె
యనియు బాలులకును మూగలకునుజడులకును నంధులకును జెవిటివారికి
నిజ్ఞానశక్తులు బ్రకాశింపఁజేసెడి స్వామియితఁడేయనియు శ్రీభాష్యకారు
లయవతారమే యితఁడిదితప్పదనుచుఁ బరమపదమందు నిజస్వరూపము
ను బొందఁగోరిముముక్షువు లీభూమిలో నీస్వామికృపకుఁ బాత్రులౌదుర
ని లక్ష్మణాచార్యులానతిచ్చిరి ॥ ( ఈ సకలవేదాంత సారమయిన తిరుమం
త్రసారముల నానతిచ్చి సూత్రార్థములఁజూడనేర్చియు జూడనేరరనిమీఁ
ద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సూత్రార్థములనెలఁ జూడనేర్చియుఁ దాము చూడనేరరు ఈవ
సుమతిలోన । బహువిధప్రఖ్యాత పరదోషనిజగుణ వితతినివిరేవివేకులని
యు । సకలభాషాంతర శబ్దార్థములనెల్ల నెఱిఁగియుఁబరుఁబధమ్మెదుట
నుండి । మర్మంబుగాఁడ దుమార్గానంబుతోఁదిట్టఁ దెలియరర్థంబేటి తెలి
వియనియుఁ । గొదువలీరెంటనేకానికోరియుచట । విసుకులేకెప్పుడును
లెన్నవెదకినైన । గానమెవ్వరియందు లక్ష్మణమునీంద్రు । కరుణగలిగిన
వారందుఁ గనియువినియు॥ ౨౨

తా॥ సూక్ష్మములయిన యర్థములనెఱిఁగియు నెఱుఁగనివారివలె నుం
దురనియు నీభూమిలో బహువిధములుగాఁ బరులదోషములను దమగుణ
ములను జూడని వివేకులనియు సర్వభాషల నెఱిఁగినవారనియుఁ బరులయిన
వారు తమయెదుటనుండి మర్మములనె తిట్టినను నది తెలియనివారివలె నీ

తెండుకొనుమవలెకాని మఱిలేదనియుఁ గొనుమవలెక యెప్పుడును లెస్సవెతికి
న నెవ్వారియందా కొనుమవగాన మట్టుగాన నెంబెరుమానారు జీయరుకృప
గలిగిన వారియందునుగన్నది విన్నదిలేదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజన కల్పకంబను మహాప్రబంధంబునందు లక్ష్మణ
మునివైభవ ప్రకాశప్రకారంబు చెప్పుచున్న వశీకృతాంత శత్రునియమ
నప్రకారంబును లక్ష్మణాచార్యావతార స్థలజ్ఞానాది గుణసద్భావ వర్ణనంబు
ను హితోపదేశప్రకారంబును సదాచార్యప్రవృత్తిప్రకారంబును యతీం
ద్రగుణ సామ్యంబును తత్సహితాద్యుపదేశ సమయంబున విప్రలంభాది
దోషరహితంబును శిష్యజ్ఞానాదివర్తన ప్రకారంబును తదధిష్ఠిత దేశాది వై
భవంబును శాంతికూలాద్యనువర్తనప్రకారంబును తత్ప్రియజనకృతకృత్య
భావంబును తదనుకూలప్రతికూలజనలాభకీర్తనంబును దివ్యకోవలూరునిర్వ
హించిన ప్రకారంబును త్రివిక్రమావతారంబును స్థలవైభవంబును తన్ని
ర్యాణప్రకారంబును తద్దివ్యవిగ్రహవర్ణనంబును తత్కృతోపకారవర్ణనం
బును సంతతస్మర్తవ్యంబును తత్కృపాపాత్రజన వైభవంబును నాచార్య
గురుదేశిక శబ్దవాచ్యత్వంబు నన్నది దశమ ప్రకరణము॥

శ్రీమదచ్యుత శఠకోపయతిరాజ వరవరముని నిజగురుభ్యోనమః.



శ్రీమతే రామానుజాయ నమః.

## ముముక్షుజనకల్పకము.

### ఏకాదశ ప్రకరణము.

ఈక్రమముగా నెంబెరుమానారు జీయరు వైభవ మానతిచ్చి
యీపది ప్రకరణములలోవలి యర్థనిర్ణయములను బదునొకొండవ
ప్రకరణమునందు మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ సత్యాచ్యుతాకాశ సద్బ్రహ్మశంభుపరంజ్యోతి రింద్రహిరణ్యగర్భ।
సవితృప్రజాపతీశ్వర ధాతృశివమహేశ్వరముఖ సామాన్యవాచకముల।
సరసివిశేష పర్యవసానముగఁజేతు రార్యులు నారాయణాహ్వయునకు।

గౌణముఖ్యోభయాకారవాచకములై వేదాంతములయందు వెలయునవి
యు । సతేఁజపురుషోత్తమాచ్యుతానంతవిష్ణు । వాసుదేవాద్యసామాన్య
వాచకములఁ । చెప్పఁబడుచున్న లక్ష్మీవిశిష్టమూర్తి । యనియునీయర్థమి
లలక్ష్మణార్యుఁడెఱుఁగు॥ ౧

తా॥ శ్రియఃపతియైన నారాయణునికి గౌణముఖ్యములని రెండువిధ
ములుగాఁ జెప్పఁబడియున్నవని వేదాంతములఁ జెప్పబడిన తిరునామములె
ట్టువలెననఁగా సత్యమనియు నయుక్తుండనియు నాకాశమనియు శంభుఁడని
యుఁ బరంజ్యోతియనియు నింద్రుఁడనియుహిరణ్యగర్భుండనియు సూర్యుఁ
డనియుఁ బ్రహ్మయనియు విధాతృఁడనియు శివుఁడనియు మహేశ్వరుఁడని
యు నిట్టితిరునామములు గౌణములని సామాన్యవాచకములనియుఁ బెద్దలు
వివేకించి త్రోసివేసియుందురని యాచార్యులానతిత్తురనియు నందులోముఁ
ఖ్యమైన తిరునామములే మంచివనియు సతండై పురుషోత్తముండనియు న
చ్యుతుండనియు ననంతుండనియు విష్ణువనియు వాసుదేవుండనియునిటము
ఖ్యతిరునామములు చెప్పఁబడుననియు లక్ష్మీవిశిష్టమూర్తియనియు నీయ
ర్థము లీలోకములో నెంబెరుమానారు జీయరెఱుఁగుదురని లక్ష్మణార్యులా
నతిచ్చిరి॥ (శ్రియఃపతియొక్క గౌణముఖ్యతిరునామముల నానతిచ్చి చి
దచిదీశ్వరులనెడి తత్త్వత్రయముగూడి తిరుమేనై యుండునని మీఁద నానతి
చ్చుచున్నారు ।)

సీ॥ త్రివిధచిదచిద్వస్తు దేహవిశిష్టమై యేకమెయనఁబడు నెపుడునేది।
యుర్విలోనూర్ణనాభ్యుపహితమై మేనుగలిగించిమిఁంగు లోకములనేది ।
దేహాత్మరక్షణస్థితిసంకరము లేని కరణినెప్పుడునిర్వికారమేది । సకల దేహ
ప్రవేశన హేతుభిద చేతఁ బుణ్యపాపంబులఁబొరయదేది । యఖిలనిగమన
నారాయణానువాక్య । సిద్ధలక్ష్మీవిశిష్టనిశ్చితమునేది । యేదితానిచ్చసం
బంధమెఱిఁగినపుఁడె । యదియెపరతత్త్వమని లక్ష్మణార్యులనిరి॥ ౨

తా॥ హేయగుణములు గలిగి నయు చిద్దేహమును జ్ఞానగుణములు గ
లిగిన జీవాత్మయును శ్రియఃపతియు నీమూఁడువిధముల చిదచిదీశ్వరులని
యెడి తత్త్వత్రయముఁగూడి తిరుమేనై యేకమైయెప్పుడునున్న వస్తువేదియ
నియు భూమిలోనూర్ణనాభియనెడి సాలీఁడిపురుగు తనదేహమునందె నూలు
కల్పించి విస్తారముగాపల్లుకొని తానుమఱియొక దిక్కుకుదొల్గించి యా
యల్లినసూలు తానెమిఁంగినట్లుదనతిరుమేనునందు సకలప్రపంచమునుగలిగిఁ

జేసి సంహారమందుఁదనకుక్షిలోనుంచుకొనెడివస్తువేదియో యాఁదనతిరుమేనుదమయాత్మయునురక్షించుకొనవలెననెడి సంకరమైనగుణములులేక యెప్పుడును వికారములులేని వస్తువేదియనియు సకలదేహంబులందుఁ బ్రవేశించియు నాయాత్మలుచేయుపుణ్యపాపంబులు బొందకుండెడువస్తువేదియనియు నావస్తువు సమస్తవేదాంతములచేత నిశ్చయింపఁబడి సిద్ధముగా లక్ష్మీవిశిష్టుఁడైనవాఁడె నారాయణుండనియు నాచార్యోపదేశమువలనఁ దనసంబంధమెఱిఁగినపుడు తానాయెఱిఁగిన వారివశమైయుండునో యట్టి వస్తువు పరతత్వమని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (శ్రియఃపతియొక్కండె సృష్టిస్థితి సంహారములుచేసునని యానతిచ్చి యీవిధమునఁ గావించుకొనుచును బ్రకృతిలేని వస్తువేదియని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చిదచిదాత్మకజగత్సృష్టిస్థితిలయ ప్రకృతిమోచన పరబ్రహ్మమేది। నిఖిలహేయప్రత్యనీకకల్యాణైక తానాపరిచ్ఛిన్న తత్వమేది। యాయుధాభరణరూపాఖిల తత్వాంతరాధార విగ్రహాయతనమేది। భోగలీలార్థవిభూతి ద్వయస్థిత ప్రత్యగాత్మోచిత పారిష్యమేది। శంఖచక్రాదిచిహ్న ప్రశస్తమేది। శేషశయనత్వ లక్ష్మీవిశిష్టభావ। వేదమయగరుడ వాహత్వవేద్యమేది। యదియెపరతత్వమని లక్ష్మణార్యులనిరి॥ 3

తా॥ తత్వత్రయముచేత జగత్తులసృష్టించను బోషించను సంహరించను గర్తయైయుండియుఁ బ్రకృతిసంటకుండనుండిన బ్రహ్మమేదియనియు సమస్తహేయములకుఁ బగవాఁడైన వస్తువెవ్వఁడనియుఁ గల్యాణగుణములుగలవాఁడెవ్వఁడనియు నేర్పాటుగానుండు వస్తువెవ్వడనియు దివ్యాయుధములుగలిగి శ్రీవత్సకౌస్తుభాద్యాభరణములు గలిగినవాఁ డెవ్వఁడనియు స్వరూపములుగలిగిన పంచతత్వములఁగూడిన యాత్మలకు నాధారమైన విగ్రహముగల వస్తువేదియనియు నిత్యవిభూతి లీలావిభూతులు రెంటికిని గర్తయైయుండిన వస్తువేదియనియు నీయాత్మకుఁ బ్రత్యేకమైన పారిష్యమిచ్చెడు వస్తువేదియనియు శంఖచక్రాది చిహ్నములుగల వస్తువేదియనియు శేషశయనమును లక్ష్మీవిశిష్టముగానుండియు గరుడవాహనముగల వేద్యవస్తువేదో యదేపరతత్వమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ప్రకృతితోఁగూడియుండియుఁ బ్రకృతివాసన లంటకుండెడి వస్తువుపరతత్వమని యానతిచ్చి యీయర్థము నెఱుఁగుదునను వారెఱుఁగలేరని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఎఱుఁగనేననువాఁడె యెఱిఁగినవాఁడౌను నెఱుఁగుదుననువాఁడె

యెఱుఁగఁడేది । తన్నుఁదా నెఱుఁగ లేడని చెప్పఁబడునేది జ్ఞానసత్యానందజల్పమేది । యేరికిలభ్యమై యెవ్వనివరియించె వానికిలభ్యమేవంక నేది । యఖిలాంతరాత్మయై యాశ్రితజనమునా నందింపఁజేయు స్వానంద మేది । విష్ణుగాయత్రిదర్శితవేద్యమేది । వర్ణసంఘాదిమాకార వాచ్యమేది । సకలవేదాంతపర్యవసానమేది । యదియెపరతత్వమని లక్ష్మణార్యులనిరి॥ ౪

తా॥ ఈపరతత్వమైనవస్తువు నెఱుఁగవలెననెడివాఁడె యెఱిఁగినవాఁడనియు నెఱుఁగుదుననువాఁడె యెఱుఁగకయుండెడి వస్తువును నెఱుఁగఁడనియుఁ దనకుఁదానె యెఱిఁగెదననఁగా నెఱుఁగకూడదనియు జ్ఞానసత్యాదిషడ్గుణములుగల వస్తువేదియనియుఁ దనకు నుపదేశింపఁబడిన జ్ఞానముచేతఁ జూచినవారికి లభ్యమైయుండెడి వస్తువేదియనియు సమస్తమైనయాత్మలయందు నంతర్యామియై తన్నాశ్రయించినజనుల నానందింపఁజేయుచున్న బ్రహ్మానందమేదియనియు విష్ణుగాయత్రిచేతఁ జూడఁబడిన వేద్యమేదియనియు నక్షరములలో నకారవాచ్యమైన వస్తువేదియనియు సకలవేదాంతము లేర్పాటుచేసినవస్తువేదో యదియెపరతత్వమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎఱుఁగనివాఁడు పరతత్వవస్తువు నెఱుఁగుననియానతిచ్చి కారణత్వశేషత్వ రక్షకత్వాదులను నేర్పాటుగామీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కారణత్వము రక్షకత్వంబు శేషత్వమిందిరా నాథత్వమెవ్వనందు । భర్తృత్వమును జ్ఞేయభావంబు స్వామిత్వమీప్సితోపాయత్వమెవ్వనందు । నాధారభావంబు నంతరాత్మతయును నిష్టబంధుత్వంబు నెవ్వనందు । భోక్తృత్వమును దాసభోగ్యత్వమును గర్వ మెచ్చనీకుండుట దెవ్వనందు। హితకృదాచార్యభావము దెవ్వనందు । నెదురుచూచెడి ప్రాప్యత్వమెవ్వనందు । హేయసంబంధమెడలించు నెవ్వఁడతని । కతఁడె సుప్రాప్యుఁడని లక్ష్మణార్యులనిరి॥ ౫

తా॥ కారణత్వమును రక్షకత్వమును శేషత్వమును శ్రియఃపతిత్వమును నీగుణము లెవ్వనియందుండుననియు భర్తృత్వమును జ్ఞేయత్వమును స్వామిత్వమును సకలాత్మలను నుజ్జీవించి బ్రతికెడు నుపాయత్వమును నివి యెవ్వనియందుఁ గలవనియు సకలాత్మలకును నాధారత్వమును నంతర్యామిత్వమును నిష్టమైనబంధుత్వమును నెవ్వనియందుఁగలవనియు భోగించెడికర్తృత్వమును దాసులభోగ్యత్వమును గర్వమెంచకుండ శిక్షించునది యెవ్వనియందనియు నాత్మకుహితవుచేసెడు నాచార్యత్వమెవ్వనియందనియు

నెడఁబడుచూచెడి మంచిగతియెవ్వనియందనియుఁ హేయసంబంధమునఁబడి నయాత్మలను వెడలించునది యెవ్వనియందనియు నీయాత్మలకు నతఁడెను గతియని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (శ్రియఃపతి సకలాత్మలను సకలకల్యాణగుణములచేత రక్షించునని యానతిచ్చి దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములు మాని శరణాగతుఁడౌనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ధరమంత్రపర దేవతా సాధనాంతరములు మాని హరిపాదములకు మ్రొక్కి । తత్తదీయాచార్య దాస్యరసజ్ఞుఁడై కాలంబు ద్రొబ్బితత్కరుణవడసి । చేరుచున్నఁడొ ప్రాప్య సీమలోనికిఁబోయి లక్ష్మీశుఁడనపీడలంకరించి । పూర్వసంచితపాప పుణ్యముల్ పరులందుఁ గొనఁజేసి ప్రారబ్ధము నముగిసిన । నెప్పుడైనను నెటునెచటనైన । నుచితమైనట్లు దేహవిముక్తుఁజేసి । యపుడె కొనిపోయి భోగించు హరియునతని । దిరుగనీఁడ నెలక్ష్మణదేశికుండు॥ ౬

తా॥ దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములు విడిచి శ్రియఃపతి యొక్క తిరువడిగళకు శరణాగతుండు గావలెననియు నాశరణాగతుఁడు శ్రీవైష్ణవులయందును నాచార్యులయందును దాస్యమందును రుచిగలిగి యుండవలెననియు నున్నదినము లీవిధమునఁ గాలముగడపి వారికృపతనకుఁ గలుగవలెననియు మీఁద శ్రియఃపతి సన్నిధానమైన ప్రాప్యసీమకుఁబోయి చేరుచున్నఁడో యనిన యపుడె పరమపదము శృంగారింప శ్రియఃపతియును మతింతురనియు నీయాత్మపూర్వమందుఁ గూర్చఁబడిన పుణ్యపాపములు పరులయందుండఁజేతురనియుఁ బ్రారబ్ధమైనకర్మములు ముగిసెననియు నేదేశనైనను నేవిధముననైనను నేస్థలమందైనను నుచితమైనట్లు దేహమువిడిపింతురనియు నీయాత్మను నప్పుడె కొనిపోయి శ్రియఃపతి భోగించుననియు మరలజన్మములకు రానీయఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శరణాగతుఁడు దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములు మానినప్పుడె శ్రియఃపతిపరమపదములోఁ బెట్టుకొని భోగించుననియానతిచ్చి సమస్తాత్మలు శ్రియఃపతికిఁ బరతంత్రులని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అఖిలచేతనులు శ్రీహరికెప్డు పరతంత్రులే యవస్థనుదప్ప దిందునందు । నతనిలీలకె పాత్రులగుదు రనాద్యచిత్సంబంధ విస్మృతస్వాములగుచు । నతనిచ్చనేను క్తులై పోయి తద్భోగసహకారులౌదు రా స్వామికృప

నె । స్వస్వామిసంబంధ సద్భావమెఱింగించు దేశికోత్తమ పదాధీనులగు
చు । ననుచుఁ జెప్పినశాస్త్ర సారార్థమిచటి । కతఁడె దేశికుఁడై వచ్చి యవ
తరించి । సారెకును దెల్పునట్టి యాచార్యుఁ జేర । ముక్తసముడ నెలక్ష్మణ
మునివరుండు॥ ౭

తా॥ సకలమైన చేతనులు శ్రియఃపతికిఁ బరతంత్రులనియు నేయవస్థల
ను లీలావిభూతిని నిత్యావిభూతులయందును నాత్మలకుఁదప్పదనియు నీప
రతంత్రులైన యాత్మలతనిలీలకే పాత్రులాదురనియు దేహసంబంధమునఁ
దగిలి విషయములమరగి స్వాతంత్ర్యము గలుగఁ జేసుకొని దుఃఖములపా
లైయుందురనియు శ్రియఃపతికరుణచేత ముక్తులై పోయియాతనితోడఁ గూ
డిభోగములనుభవింతురనియుఁదమ్మునేలినవారి సంబంధమునునాసంబంధ
ము యొక్క తలఁపులను నానతిచ్చి యాచార్యునికి నధీనులగుచునుండవలె
ననియు నీలాగునఁ జెప్పెడుశాస్త్ర సారార్థము లెక్కడికతండే యాచా
ర్యుఁడైవచ్చి యవతరించి పలుమారానతిచ్చినట్టి యాచార్యుని సన్నిధిని
జేరినయతండుముక్తులకు సముఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సకలాత్మ
లును శ్రియఃపతికిఁ బరతంత్రులై యుండఁగా నాచార్యుండేలిన స్వామిసం
బంధమునఁ గడతేర్చుననియానతిచ్చి శ్రీవైష్ణవసతులతోడి విషయములు
కూరిరములని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తులసీవనము మూత్రదుష్టంబు చేయుట వైష్ణవసతి కామవశతఁ
గూడ. । నవకర్మలస్మశానము మెట్టిమూత్రంబువిడుచుట పాకృత వెలఁది
బొందఁ । బ్రత్యక్షవిషమునిర్భయమునఁ దిన్నట్లు శాస్త్రనిషిద్ధాన్యసతులఁ
గవయ । భర్తిమసినిద్విషమిశ్రభక్ష్యాసిమైనట్లు విహితబుద్ధిని భార్యవెను
దగిలిన । నెత్తిగొనిపాడుచుకొనఁగత్తివెదకినట్లు। దేహాపంవశులైతమ్మఁ
దెలియకన్య । లాత్మహితమును నెఱుఁగక యాశపడిన । గూడరాద నెల
క్ష్మణగురువరుండు॥ ౮

తా॥ తులసీవనమందు మూత్రము విడిచుటయుఁ గామపరవశులై శ్రీ
వైష్ణవస్త్రీలఁబొందుట ప్రాయశ్చిత్తములేని మహాపాపమనియుఁ గామప
రవశుఁడై పాకృతస్త్రీలనుబొందుట ప్రత్యక్షముగా నూతనమైన స్మశాన
ములో మూత్రమువిడుచుటకు సరియనియు శాస్త్రమునందుఁ బరస్త్రీసం
గమముఁ గూడదనిచెప్పియుండఁగాఁ బురుషుఁడు కామపరవశుఁడై యన్య
స్త్రీలఁ బొందుటభయములేక ప్రత్యక్షముగావిషమును భక్షించుటకు సరి

యాన్ననియు శాస్త్రోక్తరీతిని నగ్నిసాక్షికముగ వివాహమైన తనభార్యతోడఁ గామపరవశమునఁగూడిన కూటమి యాఁకలిచేత భ్రమసివిషముతోఁ గూడిన యన్నముఁదినుటకు సరియౌననియు నట్టియన్నము దిన్నఁవాఁడు బ్రతుకఁడనియు వెఱ్ఱివాఁడు దన్నుఁబొడుచుకొనఁ గత్తిపట్టినట్లు శరీరమునకుఁ బరవశులై యితరులను దమ్ముఁదాము నాత్మహితమైన జ్ఞానానంద గుణములను వీని నెఱుఁగక యిట్టివిషయాంతరములయం దాశపడినవారినిఁ గూడరాదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( కామపరవశమైన విషయము లీయాత్మకు విరోధములని యానతిచ్చి పంచేంద్రియములును గర్మేంద్రియములును శ్రియఃపతికి సమర్పణముగాకుండెనేని ఫలించదని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ చిత్తంబు శ్రీపరుఁ జేరితిరుగకయున్న వాగచ్యుతస్తుతివదలకున్న । వీ
నులీశ్వరు కథల్ విననాశపడుచున్నఁ గన్నులంబుజనేత్రుఁగనుచునున్న । రస
నయుఁదదభీష్టరసస క్తయగుచున్నఁ ద్వక్కు తత్స్పర్శకెలగిలియున్న । జేతు
లాతనిపూజఁ జేయఁగోరుచునున్నఁ జరణముల్ వెనువెంటఁ జనుచునున్న ।
యప్పుడివియెల్ల సఫలంబులౌటనరుల । కట్లుగాకున్న మునుపు సంహారదశను ।
గరణములు లేక యున్నట్టిక్రమము మేలు । తెలిసినపుడ నెలక్ష్మణదేశికుండు॥

తా॥ శ్రియఃపతితిరువడిగళయందు మనస్సుదగిలి యుండవలెననియు వాక్కెప్పుడు శ్రియఃపతి తిరునామము లుచ్చరించుచుండవలెననియుఁ గన్నులచూపులు శ్రియఃపతితిరుమేనును జూడవలెననియు జిహ్వయందురుచి శ్రియఃపతియొక్క తీర్థప్రసాదముల యందుండవలెననియుఁ ద్వక్కులతని తిరుమేను స్పర్శగలిగియుండవలెననియుఁ జేతులు శ్రియఃపతియొక్క తిరువడిగళ పూజచేయవలెననియుఁ గాళ్లు శ్రియఃపతియొక్క కైంకర్యములకుఁ దిరుగవలెననియు నప్పుడీమనుష్యులకు నీవిఫలించిన ఫలములౌననియు నాప్రకారమె సర్వేంద్రియములును శ్రియఃపతియొక్క కైంకర్యమునకురాకుండెనేని మునుపు సంహారమందు శరీరేంద్రియములు లేకయున్నట్టి క్రమమే యివి తెలిసినపుడు మంచిదై యుండునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (సకలవిషయములను శ్రియఃపతి కైంకర్యమునకు సమర్పించి బ్రతుకుండని యానతిచ్చి జ్ఞానాధికులైన పెద్దలలో సామాన్యులైన యుల్పులుకూడియుండువిధముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ రాజయోగ్యంబైన రాజనంబులుకుచో నక్కతోకయు గొరివెనదు

మ మొలిచి । కలుపుతీసెడు వేళఁ గలసివరివలెనుండి ఫలవేళఁ దెల్లవిసఁ బొ
సినట్లు । శ్రీసు కైంకర్య విశేషార్హజనులలోఁ గొందఱల్పులు తాముగూడి
వారి । పగిదిని నామరూపంబులుధరియించి తమనడత తెలిసినంతట నెపొ
సి । దురభిమానంబుతో మహాత్ముల కెక్కిపు । దలఁచి చెడి భూమిలోపలఁ
దాముసట్లు । కొన్ని దినములు దుర్వివేకులినెకూడి । తేర లేరం నెలక్ష్మణ
దేశికుండు॥ ౧౦

తా॥ రాజులకు యోగ్యమైన రాజనపువడ్లువిత్తినపుడు నక్కతోఁక పై
రును గూడ మొలిచియుండుననియుఁ గలుపుతీయునెడ నా రాజనపు పైరువ
లెఁదోఁచింపఁజేసి కలసియుండుననియు వెన్నులు వేసిఫలించు వేళ నక్కతోక
యను కసవుకనిపించుననియు శ్రియఃపతి కైంకర్యములు సేయుటకు సంతో
షపడు పెద్దలతోఁ గొందఱల్పులుగూడి వారివలె నామరూపములు గలిగి
యుందురనియు నామీఁదఁదమనడతలు తెలిసినంతటనే తొలఁగిపోయి దు
రహంకారమున మహాత్ములైన పెద్దలకుఁగీడుదలంతురనియు నటువలెదలం
చి చెడి భూమిలోఁదాము కొన్నిదినముల వివేకులతోఁ గూడుదురనియు న
ట్టివారుకడతేరలేరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సహవాసయోగ్యులుగా
ని వారితోఁగూడి రేని చెడుదురనియు నట్టియల్పులఁగూడినవారు కడతేర
రనియానతిచ్చి శేషత్వ పారతంత్ర్యాదులతోడ నుండవలెనాత్మను జెంచను
పాయము శ్రియఃపతి మనస్సునను౦చిన దాసుండైన చేతనుండుండు నునికి
మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ శేషమైపరునకు శేషత్వమాతండె చెరచఁజూచినవేళ శేషియగు
ట । రక్ష్యమై స్వామికి రక్షకుండగువాని సౌందర్యమది చూచి స్వామియగు
ట । భోగ్యమై భర్తకు భోగరహస్యమై భోగించుతరిఁదానె భోక్తయగుట।
నిర్వాహ్యుఁడై సర్వ నిర్వాహకుని దాస్య నిర్వాహముల కెల్లనేతయగుట ।
యతనిపడవస్థలకు గురుండధికుఁడగుట । వైష్ణవత్వంబునదిగలవారిఁగూడి।
బోధ్యబోధకభావవిస్ఫురణగలిగి । యుండవలెననెలక్ష్మణ యోగివరుఁడు॥

తా॥ శేషత్వపారతంత్ర్యాదులుగల చేతనుని శ్రియఃపతి చేరఁజూచెడు వే
ళ వీఁడు శేషిగావలెననియు నొకరిచేత రక్షింపఁబడెడు వాఁడయ్యును సక
లాత్మలను దానురక్షించువాఁడై యుండుననియు నేలికవాఁడై యుండెడి
శ్రియఃపతి చక్కఁదనము చూచి తానుస్వామిగావలెననియుఁ బురుషునికి
భోగ్యమైనరహస్యమును భోగించునప్పుడు తాను గర్తయనవలెననియు దా

స్వరూపము నిర్వాహకుండై శ్రియఃపతికైంకర్యములకుఁ దానెకర్తయనవలె
ననియు శ్రియఃపతి పరత్వవ్యూహ విభవాంతర్యామిత్వార్చావతారాచా
ర్యత్వములను నీషడవస్థలలో నాచార్యుండధికుండనియు నటువలెనెఱింగిన
శ్రీవైష్ణవత్వమనియు నట్టివారినిగూడి వారానతిచ్చిన బుద్ధులువినగలవాఁడ
నియుఁ దాను వారానతిచ్చిన క్రమమున నడవఁగలవాఁడనియు మనస్సునని
డాకుగాఁ దాత్పర్యము గలిగియుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శే
షత్వముతోఁడఁగూడిన యాత్మలను శ్రియఃపతియే లెక్కి ఫలమానతిచ్చి తిరు
మంత్రమందున్న తాత్పర్యము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఓమనిపరులకై యున్నతన్నేకనిమటి నమోయనితన మనికిఁజెప్పి।
యామీఁదఁదనకంత రాత్మనైయున్నట్టి వానిదాస్యమె చేయు వాఁడననుచు।
నెఱిఁగితాఁ జేయు నద్దెల్లవానిచ్ఛనే యని తెలిసినిర్భరుఁడైనఁగాని। పాకృ
తత్వముజారి బంధంబులూడి శ్రీవైష్ణవులను జేరి వసుధలోన। బ్రతుకఁటిట్ల
ని తెలిసినభాగ్యశాలి। తెలిసినటువలెనిలచెనా తిరుగులేని। పదవిఁజేరు
ను దేశిక ప్రవరుకృపను। దెలియుమేలనె లక్ష్మణదేశికుండు॥ ౧౨

తా॥ ప్రణవమైనఓమను నేకాక్షరము నుచ్చరించెడు పరులకొఱకు శ్రి
యఃపతిదానుండౌనునికి కనవలెననియు నామీఁదనమనస్సు నుచ్చరించితన
బ్రతుకుచూడవలెననియు నామీఁదఁదన కంతర్యామినై యుండెడి శ్రియః
పతిదాస్యము చేసెడువాఁడను నేననియు నిటువలెమంత్రసారార్థమెఱిఁగితా
నుజేసెడి కార్యములన్నియు శ్రియఃపతి యిష్టముచేతఁ జేసితిననిభయము
లేక నిర్భయుఁడై యున్నప్పుడు పాకృతక్రియలుమాని కర్మబంధములు వీ
డిపోవుననియు శ్రీవైష్ణవులఁజేరుననియు నీభూమిలో బ్రతుకును నిటువలెబ్ర
తుకునదీ భాగ్యము చేసినవారికనియుఁ దనకుఁదెలిసినటువలె నిలిచెనేని తిరు
గులేని పరమపదము చేరుననియు నాచార్యకృపచేత నిట్టితాత్పర్యములుపు
ట్టునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఇటువలె మంత్రసారార్థములైన తలం
పులును నిలుకడలును నానతిచ్చి బద్ధచేతనులు శ్రియఃపతికి శేషమైతాము
స్వతంత్రులమనుచు నుందురని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ బద్ధచేతనులు శ్రీపతికొక్కనికి శేష మయ్యుస్వతంత్రుల మనుచు భ్ర
మసి। నిత్యభోగానంద నిర్మలాకృతులతో సములయ్యు దేవాది జాతిఁబు
ట్టి। పురుషోత్తమునికిష్ట భోగార్హులయ్యును గామినీసంయోగ గతులగో
రి। హరిదాసులనుగూడియాడ యోగ్యులనయ్యుఁ దమదేహ సౌఖ్యవర్థ

కులఁగూడి । భగవదిష్టానువృత్తికే పాత్రులయ్యుఁ । దెలియకనగతకర్మవిధేయులగుచు । నుండునది చూచి యతిరాజులుర్విఁబుట్టి । తెలుపఁగానను లక్ష్మణదేశికుండు॥ ౧౩

తా॥ బద్ధులైనచేతనులు శ్రీయఃపతికి శేషమై తాముస్వతంత్రులమని భ్రమసిరనియు నటువలెనుండిన యాత్మలకు వేదాంతరహస్యములయందుఁ జెప్పఁబడినయాత్మలు జ్ఞానగుణములుగలిగియుఁ గర్మబద్ధులైనయాత్మలవలె దేవమనుష్య తిర్యక్స్థావరజంగమాదుల యోనులందుఁ బుట్టిరనియు శ్రీయఃపతికి నిష్టమైనభోగమున కర్హులైయుండియు స్త్రీలకు శేషమైయుండి వారిసంగతులు గావలెనని కోరిరనియు శ్రీయఃపతిదాసులతోడ గూడియుండ యోగ్యులైయుండియుఁ దమకు దేహావర్థకులైన దేహసంబంధులననర్థకామాదులను విడువక కూడియుండిరనియు శ్రీయఃపతికి నిష్టమైన నడతకుం బాత్రులైయుండియుఁ దెలియనేరకయుండిరనియు ననుగతముగా వెంటఁదిరుగునట్టి పుణ్యపాపరూపములైన కర్మముల ననుభవించుచుండెడునాత్మల నెంబెరుమానారులు కటాక్షించిరనియు నాయెంబెరుమానారు భూమిలోనవతరించి యిట్టిపరమార్థము లానతిత్తురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( బద్ధచేతనులు కర్మపరతంత్రులై తిరుఁగఁగా నెంబెరుమానారవతరించి సకలాత్మలను రక్షించిరని యానతిచ్చి ప్రాకృతభోగములమీఁద నపేక్షలువిడిచియుండవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ప్రాకృతభోగపరాఙ్ముఖుండైనప్పు డాత్మేశ్వర ప్రాప్తికర్హుఁడగుట । యాత్మానుభూతమా త్రాభితుష్టుఁడైనప్పు డానందమయుఁజేర నర్హుఁడగుట । భగవదనుభవదాస్య పరవశుఁడైనప్పు డతనిదాసులఁగూడ నర్హుఁడగుట । వసుధనచ్యుత భక్తవత్సలుఁడైనప్పుడాచార్య సంచితార్థార్హుఁడగుట । యనుచు వేదాంతసిద్ధసారార్థమరసి । స్వానుగుణసాధ్యసాధనస్వాంతుఁడగుచు । భగవదనుదాస్యసంపదలభించి । యుండవలెనని లక్ష్మణయోగివరుఁడు॥ ౧౪॥

తా॥ శరీరభోగములమీఁది రుచివిడిచి యనన్యమైనప్పుడు శ్రీయఃపతి కృపకును బ్రాప్తికిని నర్హుఁడగుననియు నాత్మగుణములచేతఁ దృప్తుఁడగునప్పుడానందమయుఁడైన శ్రీయఃపతినిజేర నర్హుఁడౌననియు శ్రీయఃపతిదాస్యమునకు ననుభవపరవశుఁడైనప్పుడతని దాసులఁగూడ నర్హుఁడనియు శ్రీయఃపతిదాసులకువత్సలుండై శేషమైనప్పుడాచార్యులందు కూర్పఁబడినయర్థము

నడునేర్పఁడనియు ననుచు వేదాంతసిద్ధసారమైనయర్థమును నెఱిఁగియుండ వలెననియుఁ దనగుణంబులకు ననుకూలమైనఫలము మనస్సున నుంచుకొన కుండవలెననియు శ్రియఃపతికిననుభవమైన దాస్యమునులభించి యుండవలెననిలక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతికి ననుభవమైనదాస్యమును నెఱిఁగి యుండవలెనని యానతిచ్చి ఏకాంతిలక్షణముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేవతాంతరములఁ దేరిచూడనివారి యండనుండిననునే కాంతియగుట। మంత్రాంతరంబులు మానికలఁగనివారి నకలంకులనిన నేకాంతియగుట। విషయాంతరముచూచి వెరచితిరిగెడివారి కరసిడగ్గరిననేకాంతియగుట। సాధనాంతరము లసహ్యముగను వారిననుభవించిననునే కాంతియగుట। తనకుదేవతమంత్రంబు తగినవిషయ। మమరుసాధనమునుగురుఁడనుచుదెలిసి। యట్టిగురువరుఁడిలలక్ష్మణార్యుఁడనుచు। నాశ్రయించిననపుడె యేకాంతియగుట॥ ౧౫

తా॥ దేవతాంతరమును దెలిసిచూడకున్న వారిసన్నిధినుండి ననేకాంతియనియు మంత్రాంతరములు మానిన వెనుక కలంకములేకున్నవాఁ డేకాంతియనియువిషయాంతరములువిడిచి వెరచికడకుఁబోయెడివారిని జేరినయతం డేకాంతియనియు సాధనాంతరముల నసహ్యపడువారిని సేవించుచుఁ దిరిగినయతం డేకాంతియనియుఁ దనకు దేవతయు మంత్రమును దగినవిషయమును సాధనమును నాచార్యుండేయని తెలిసియుండవలెననియు నట్టియాచార్యశ్రేష్ఠుం డెంబెరుమానారు జీయరనియు నాస్వామిని నాశ్రయించినపుడితండే యేకాంతియని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఏకాంతిలక్షణములానతిచ్చి పంచభూతములను బ్రాణబుద్ధులను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భూతేంద్రియప్రాణబుద్ధ్యహమ్మనతాది కారణప్రకృతితత్కార్యములకు। నఖిలాత్మలకునంత రాత్మయైయెవ్వండు తన్నావరూపముల్ తనవిగాను। నభిమానియైతత్తదఖిలప్రవృత్తినివృత్తులు తానెకావించుకొనుచుఁ। జేతనాచేతనస్థితినున్న సర్వంబుతనశక్తిలేశసంస్థముగఁదాల్చి। యొకఁడెరక్షించశిక్షించ నుచితమెఱిఁగి। ముక్తులుగఁజేయఁగర్తయైము దముఁబొందు। నతనినెఱిఁగిననెఱుఁగుట యన్యమెల్ల। నజ్ఞలక్షణమని లక్ష్మణార్యులనిరి॥ ౧౬

తా॥ పంచభూతములును నింద్రియిములును బ్రాణములును బుద్ధియు

నహంకారమును మహత్తును నివియాదిగాఁగల ప్రకృతికార్యములను సకలాత్మలకు నంతరాత్మనై యెవ్వండు వారివారి నామధేయములకును నామరూపములకును దాముకర్తలై తమవిగానునభిమానినై వారిసకలప్రవృత్తినివృత్తులు దామె కావించుకొనుచునుండి చేతనాచేతనములైన సర్వమును శ్రియఃపతి తమశక్తిలో లేశమాత్రమున నిన్నిరూపములకును నిన్నిటినినుంచుకొని తానొక్కండే శిక్షించను రక్షించను నుచితమెఱిఁగి ముక్తులుగాఁజేయను గర్తయై ముదముఁబొందుననియు నతనినెఱింగిన నేలుఁగుటనియు నన్యమెల్ల నజ్ఞలక్షణమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పంచభూతములు మొదలైనవానిచేత శరీరములెత్తిన చేతనులకు నంతర్యామియైవారివారి నామరూపములు తమవిగాఁజూచి రక్షించునని యానతిచ్చి భాగవతాపచారక్రౌర్యముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భగవద్గృహ ద్వారపాలులయ్యును బుట్టిరల జయవిజయులదెందువలన । గమనసాధనమునుగాక తెక్కలునూడె నిలవైన తేయున కెందువలన । దెసచెడిదిక్కులు తిరుగాడు దూర్వాసునెట్టి సురలునుగావ రెందువలన । నైశ్వర్యబలయుక్తులై యుండియును జెడిరిలధార్తరాష్ట్రుల దెందువలన । నదియె తలపోయ భాగవతాపచార । మనుచుఁదద్వైభవము గొంతయైనఁదెలియ । శబరిసంబంధమున గంగశాపముడిగె । నదియులక్ష్మణముని వసుంధానతిచ్చు॥ ౧౭

తా॥ శ్రియఃపతి కోవెలవాకిట ద్వారపాలకులైన జయవిజయులుభూమిలోఁబుట్టినది యెందువల్లననియుఁ బెరియతిరువడితెక్కలూడి యెగసిపోనేరకయుండినది యెందువలననియు దూర్వాసులుదెసచెడి దిరుగుచుండఁగా నెట్టిదేవతలును గానలేకపోయినది యెందువలననియు నైశ్వర్యబలవంతులైన ధృతరాష్ట్రపుత్రులు భూమిలోఁజెడిపోయినది యెందువలననియు నదివిచారించఁగా భాగవతాపచారమనియు వారివైభవము కొంతైనఁదెలియవలెననియు శబరిసంబంధమున గౌతమీనదిశాపము వీడిపోయెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (భాగవతాపచారముచేతఁ జెడినవారినానతిచ్చి పంచసంస్కారమును గలుగఁజేసినయాచార్యుని మహిమమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పంచసంస్కారార్థ పంచకజ్ఞానముల్ కలుగఁజేసినగురు కరుణఁజెందె । యపరాధములను శ్రీహరి యోర్చిదయఁజేయ ఘటకులైన శ్రీ

గరిష్ఠునకసి । స్వోష్టసంసార జలధిలో వెడలించి తనుఁ జేర్చుకొనెడి శ్రీధరు నిఁగొలిచి । భగవదనుభవదాస్య ఫలసిద్ధి కిచ్చుటఁదగిన శ్రీవైష్ణవోత్తములఁగూడి । యవనినాచార్యులఁ బిరాట్టినంబుజాక్షు । వైష్ణవోత్తముల గువారివాసిమెఱఁగి । తనకుఁబర మోపకారకర్తలుగఁ దెలిసి । మఱువవలదని లక్ష్మణమహామునివరుఁడు॥ ౧౮

తా॥ పంచసంస్కారములు గలుగఁజేసిన యాచార్యుండర్థపంచకజ్ఞానముకలుగఁజేసెననియు నాచార్యునికృపచేత నేఁజేసిన యపరాధములకు శ్రీయఃపతి యోర్చుకొనిరనియు నత్యంతకృపను గలుగఁజేయు ఘటికురాలై పిరాట్టి మహిమ లెఱిఁగి యుండవలెననియు నాకిష్టమయిన సంసార సముద్రములోనున్న వానిని వెడలించి తమ్ముఁజేర్చుకొనెడు శ్రియఃపతిని గొలువవలెననియు శ్రియఃపతికి ననుభవమయిన దాస్యఫలముసిద్ధించెడుకొరకు యోగ్యులిచ్చుట శ్రీవయిష్ణవులను గలసియుండవలెననియు నటుగాన నాచార్యుడు పిరాట్టి శ్రియఃపతియును నీమాగ్గురి తారతమ్యము లెఱిఁగి శ్రీవైష్ణవోత్తములైన వారుండవలెననియుఁ దనకునుత్కృష్టులైన యుపకారకర్తలని తెలిసియుండవలెననియు నట్టిమహాత్ములను మఱువవలదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఆచార్యునిబిరాట్టిని శ్రియఃపతినిగూడి శ్రీవైష్ణవుల తారతమ్యమెఱిఁగియుండవలెనని యానతిచ్చి ప్రాకృతదేహభోగంబులమీఁది యాశవిడువవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కర్మాంతరతమ భావకల్పితప్రాకృత దేహభోగంబులఁ దృష్ణవాసి।
దేహావిలక్షణస్థిర నిర్మలస్వాత్మ సుఖమాత్రమునఁ జిక్కుచొక్కరోసి।
యానందమయసకలాంతర్బహిస్థితి ప్రాప్తసర్వేశ్వరప్రాప్తిగోరి । తత్వరహస్యార్థ తాత్పర్యవిద్దేశికోత్తమాంగీకారయుక్తుఁ జేరి । తత్తదియానువర్తనధన్యులగుచు నంతకాధ్ములతలమీఁద నడుగులిడుచుఁ । దేరియానందమునను౦డుదృఢమతులకు। మ్రొక్కుమని చెప్పె లక్ష్మణమునివరుండు॥ ౧౯

తా॥ కర్మములను ననుకూలములైన దేహములను శ్రియఃపతి యిష్టముచేతఁ గల్పితములైన శరీరభోగములమీఁది యాశను విడువవలెననియు దేహావిలక్షణము మొదలయిన యాత్మమీఁది సుఖమోహములను గోయవలేననియు మఱిమెటుల నుండవలెననఁగా నానందమయుఁడై సకలాత్మలయందును లోపల వెలుపల నుండి రక్షించెడి శ్రియఃపతిసేవ కోదువలేకదోరుకుననియుఁ దత్వత్రయము రహస్యత్రయము మొదలైనరహస్యములా

నతిచ్చిన పూర్వాచార్యు లంగీకరించిన యాచారములను శ్రీసూక్తులను జేరి చదివివిని యనుభవించునట్టి పెద్దలతోఁగూడిన యతఁడు ధన్యుండనియు నతండంతకుండైన యమునితలమీఁద నెక్కి త్రొక్కుచుండుననియు సకలక ల్మషములవిడిచి తేరి యానందమున నుండెడి దృఢచిత్తులైన మహాత్ములని త్యమును సేవించుమని లక్ష్మణార్యులానతిచ్చిరి ॥ ( దృఢచిత్తులైన శ్రీవైష్ణవులను నిత్యమును సేవించుమని యానతిచ్చి బ్రహ్మాండముల వివరములు మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ లోనఁబద్ధాలుగు లోకముల్ పైపైని హెచ్చినా వరణంబులేడుగలిగి । యుండునీబ్రహ్మాండ మొకటినీరీతిని కోటిసంఖ్యల నెన్నఁ గొలఁదిగాదు । అవియెల్లనొకమాటెనడఁచఁబుట్టించను గర్తయైయొకమహా ఘనుఁడుదానె । యాత్మలఁగొందటి నందందఁజొనిపించి కర్మపాశంబులఁగట్టివేసి । క్రీడసలుపంగనొకఁడైన గెంటఁగలఁడె । తానెదయచేసి కట్లను దానెవిడిచి । వెడలఁదీసినయాత్మదా వెడలునితరు । లుందురనిచెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౨౦

తా॥ ఒక బ్రహ్మాండములోఁ బద్ధాలుగులోకములను బంచభూతములును నహంకారమహత్తులును నొకటికంటె నొకటిహెచ్చుగా నా బ్రహ్మాండమునఁగూడి యుండుననియు నవిసప్తావరణము లనఁబడియెడు దోవలుగా నుండుననియు నట్టిబ్రహ్మాండము లనేక కోట్లసంఖ్యలుగలవనియు నపరిమితమైయుండెడి బ్రహ్మాండములును నవియెల్లనొకమాఱు సంహరింపనుబుట్టింపను గర్తయైన యొకమహాఘనుఁడు తానేయనియు నతండాత్మలఁ గొందఱిని నందుఁ బ్రవేశింపఁజేసెననియు నాయాత్మలను మనుపటికర్మపాశముల నెడి తాళ్ళఁగట్టివేసెననియుఁ దానాత్మలలోనుండి పెరియపిరాట్టిఁగూడి క్రీడించుచుండుననియు నిటువలె నుండెడిమహిమను నతని కల్పితములైన మాయనుగడచిపోవ బ్రహ్మరుద్రసనకాదులు మొదలైనవారికి మహాదుర్లభమైయుండఁగాఁ దక్కినవారు కదలించఁగలరాయనియు శ్రియఃపతికృపచేత నొకానొకసిదానుగట్టిన కట్లనుదెగఁగోసి యాయాత్మను వెడలఁ దీసిన నాయాత్మ వెడలు నింతియె కాని తక్కినయాత్మలెల్ల నామాయయందు దగిలియుండురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( సకలబ్రహ్మాండవివరము లానతిచ్చి జలములయందును నడవులయందును నాకాశమందును బర్వతములయందును బుట్టెడు నాత్మలనుమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ వారిభూమ్యాకాశ వనశైలములయందుఁ బుణ్యపాప ఫలానభోక్త
లగుచు । మహదణుపరిమాణ మధ్యమాకృతులతో సీశ్వరేచ్ఛనెయా
త్మలిచటఁబుట్టి । తిరుగజాతుల లెక్కఁ దెలిసెదమనియెన్ని నను లక్షలెను
బదియాత్మలుందు । రందునరజాతి దేవాసుర ప్రకృతులై కర్మభూమిని
బుట్టఁ గలిగినపుడు । గోశవాస క్తిదైవ ప్రకృతియుఁగలిగి । వైష్ణవులజే
రఁబోయిన వారికృపనె । దేశికోత్తముఁగన వాసుదేవుఁజేరు । నతఁడెగు
రుకృపనని లక్ష్మణార్యులనిరి॥ ౨౧

తా॥ జలములనుభూమిని నాకాశమునను నడవులను గొండలను బు
ణ్యపాపము లనుభవించ జన్మములెత్తుదురనియు నణుమాత్రమైనస్వరూప
ముగలయాత్మలను శ్రియఃపతి యిష్టముచేత నిచటఁబుట్టించిరనియు నెంచి
ననాయాజాతు లెనుబదినాలుగులక్షలనియు నందులో మనుష్యజాతిని బు
ట్టినయాత్మలు దేవాంశమని యసురాంశమని యీరెండువిధముల వుట్టువు
లుగలిగినపుడు శ్రియఃపతి భక్తిగలిగిన దేవాంశములైన శరీరములుకలవ
నియు నసురాంశములైనయాత్మలు శ్రియఃపతియందుఁ బగపట్టియుందురని
యు దేవాంశమైనయాత్మలు శ్రీవైష్ణవులయందుభయభక్తులు గలిగియుం
దుదురనియు వారికృపనె యాచార్యసంబంధము గలిగి శ్రియఃపతినిజేరుదు
రనియు మఱియితరమైనవారిని జేరరనిలక్ష్మణార్య లానతిచ్చిరి॥ (ఈలో
కములోఁ గర్మదశలుగల రాక్షసప్రకృతులైన యాత్మలనుదేవప్రకృతులై
న యాత్మలనునానతిచ్చి శ్రియఃపతి నిర్హేతుకకృపచేతఁ బూర్వసుకృత
ములఁబట్టి రక్షించునని మీఁదనానతిచ్చుచున్నారు॥ )

సీ॥ పరఁడుయాదృచ్ఛిక ప్రాసంగికానుషంగికరూపజీవ సుకృతమున
కును । మిషముగావాఁడు జన్మించెడి తఱిజూడ సత్వవృత్యద్వేష సహితుఁ
డగుచు । నభిముఖుండైయంత హరిదాసులెఱిఁగింప సంప్రదాయజ్ఞునా
చార్యుఁజేరి । పంచసంస్కారార్థ పంచకజ్ఞాన సద్భక్తివైరాగ్య సంపదలు
గలిగి । యార్తిచేముక్తుఁడై పోవునదియుఁగాక । హరియెగురుజేర్చ బా
లమూకాదులైన । ముక్తులైవారి యభిమానమున నెతప్ప । దనుచులక్ష్మ
ణ మునివరుండానతిచ్చు॥ ౨౨

తా॥ శ్రియఃపతి యాదృచ్ఛికమును బ్రాసంగికమును నానుషంగికము
ను నీమూఁడు సుకృతములును దమకుఁగానుకగాఁ జేసుకొనెననియు నా
యాత్మజనించెడు వేళజాయమాన కటాక్షముచేత మనుష్యుఁడై జన్మించి

శ్రియఃపతియందు ద్వేషముమాని యభిముఖుండౌననియు నంతట శ్రీవైష్ణవులానతీయఁగా సాంప్రదాయజ్ఞుఁడైన యాచార్యునిఁ జేరుననియుఁ బంచసంస్కారములుగలిగి యర్థపంచకజ్ఞాన భక్తివైరాగ్యములఁగూడి యుండుననియు నార్తిగలిగినయపుడె ముక్తుఁడై పోవుననియు నదియునుగాక వారియభిమానమునుగల శిశువులును మూగలును జెవిటివాఁడును గ్రుడ్డివారును వారినిబొందిన ముక్తులౌదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతి జాయమాన కటాక్షముచేత నాత్మలుకడతేరుదురని యానతిచ్చి మనుష్యుఁడై పుట్టి వివేకముకలిగినందుకు లక్షణమును మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఒకవేళవరజాతి నుర్విమీఁద నెపుట్టి తనకర్మమొకటి యంతటను దెగిన । నేనెవ్వఁడనొ డొల్లి నిలిచియచ్చటనుండి యిపుడేలవచ్చితి నిచటికిఁ గను । నెటుపోవువాఁడనో యిదిచిత్రమైయున్నదని మనంబునఁ దోఁచినట్టియెడను । హరిపీనిఁగానా నా కవసరమిదియని చూచినప్పుడె సత్వశుద్ధిగలిగి । భగవద్ద్వేష ముదయించి భాగవతులఁ । గూడి భాషించఁగలిగి సద్గుణగరిష్ఠు । దేశికోత్తముఁ జేరినఁ దెలివిఁబుట్టి ముక్తుఁడౌనని లక్ష్మణముని వచించు॥ ౨౩

తా॥ మనుష్యుండై పుట్టిన యాత్మయొకవేళఁ దనకర్మములు తెగిపోయినప్పుడు నేనెవ్వండనియుఁ దొల్లినిలిచి యెక్కడనుండితిననియు నిక్కడికిప్పు డేలవచ్చితిననియు నిఁకమీఁద నెటుపోవు వాఁడనోయనియు నిదివిచిత్రమైయున్నదనియు నిటువలె మనస్సునఁ దోఁచినప్పుడు శ్రియఃపతి మనస్సునందు నీయాత్మనురక్షించుటకు నిదివేళయని కటాక్షించినయపుడెయాత్మపరిశుద్ధమైనగుణములు గలవాఁడౌననియు శ్రియఃపతియందు భక్తిగలిగి శ్రీవయిష్ణవులఁగూడి భాషించఁగలిగియు గల్యాణగుణములుగలిగిన యాచార్యునిజేరుననియు నీతెలివిపుట్టినయపుడె ముక్తుఁడౌనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఈయాత్మకు శ్రియఃపతి కృపచేత నాత్మగుణములు పుట్టి కడతేరునని యానతిచ్చి శ్రియఃపతి నిర్హేతుకకృపను నాత్మలను జేపట్టుదుర మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆకస్మికానుకం పాతిరేకావృతా ననుజేసియేపట్టు నసువదలక । మొదలనద్వేషాభి ముఖ్యసంగతుల్ గలిగించి దేశికా కారుఁడగుచు । సంస్కారపంచక సహితునిగాఁ జేసి తనకునాకునుబోని తగులుదెలిపి । పూర్వాఘములనెల్ల భోగ్యంబుగాఁగొని యుత్తరాఘములంటకుండఁ జేసి—

తముం బ్రియమును జేయుచు నెప్పుడు నెదుటం । బాయకుండియు దేశిక ప్రవర్తలక్ష్మ । ణార్యవరవరయతి రాజ హార్ద్రశరజ । దాఖ్యలమరంగహరి హృదయమునసిలిచె॥ ౨౪

తా॥ శ్రియఃపతిని శ్రేష్ఠతుకః కృపచేతనేపట్టున నైనను బట్టువదలకయుందురనియు మొదట ద్వేషము లేని గుణములను నందుకొందగిన సత్సంగతులను గలిగించిరనియు నాచార్యులై తామే పంచ సంస్కారములు ప్రసాదింతురనియుం దమకును దాసునికి నెడ తెగని సంబంధమూనతిచ్చిరనియుం బూర్వమైన మహాపాపములను బోం జేసిరనియుం నింకమీందవచ్చెడి పాపములను జేరకుండం జేతురనియు దాసునికిహితమును బ్రియమును జేయుచు నెప్పుడుం బాయకుందురనియు నాచార్యశ్రేష్ఠుండైన పెరియజీయరు ఎంబెరుమానారు నమ్మాళ్వారులు వీరిముగ్గురిహృదయములయందు శ్రియఃపతి నిలిచిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( పెరియజీయరును నెంబెరుమానారును నమ్మాళ్వారులును శ్రియఃపతికిం దిరుమేననియానతిచ్చి వర్ణాశ్రమ ధర్మములు దప్పకమూండుజాతులవారు క్రమముగా నడిచిరేని ముక్తులగుదురని మీంద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ వర్ణాశ్రమోచిత వర్గత్రయాన్విత వరవిప్రరాజన్య వయిశ్యులరసి । యాత్మేశ్వరారాధనాకారయజ్ఞాంగ సాధ్యవిద్యావిశేషజ్ఞులగుచు । యమనియమాసనా ద్యభ్యస్తమాధవ ప్రత్యాహధ్యాన సంపత్తివలన । నాశ్లిష్టనష్టోత్తరానంత పూర్వాఘచయులునై యారబ్ధజనిసమసిన । స్వాంతమధ్యాత్మమాధవ స్మరణగలిగి । యుండి యెపుడైన దేహవియుక్తులగుచు । దేవయానంబున నపోయి దేవదేవుం। గూడువార నెలక్ష్మణగురువరుండు॥ ౨౫

తా॥ బ్రహ్మక్షత్రియ వైశ్యులకు నీముగ్గురికిని నంతర్యామియారాధనకు స్వరూపమైన యజ్ఞాములైన కర్మాదులుసాధించెడు నెఱుకచేతనునష్టాంగయోగక్రమమైన యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణసమాధియనెడి యోగములచేతం బూర్వమందుం జేసిన పాపములు నష్టమవునియు నారబ్ధమైన కర్మములును జెడిపోవుననియుం దమలోనున్న యంతర్యామిస్మరణగలిగి యాతనివిగ్రహముచూచి యనుభవించికూడిరనియు నెప్పుడైనను దమకునిష్టమైనప్పుడు దేహమువిడుతురనియు నర్చిరాదిపురుషులనుగూడి యర్చిరాది త్రోవనుబోయి శ్రియఃపతిని వారు కూడుదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (బ్రహ్మక్షత్రియ వయిశ్యశూ

ద్రులు గమార్గాదులు స్వాంతముగానడిపిరేని వారు ముక్తులౌదురని యానతిచ్చి యకించనుండై శేషత్వముతోడ నుండెడు నని క్రిఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ధర నకించనులయ్యుఁ దమకు గతియును లేని సామగ్రి గలిగిన
సర్వజనులు। రక్షకుండైన శ్రీరమణుండె మాకు ప్రాప్యోపేయములు గానె
యుచితమనుచు। సద్దేశికోపదేశ ప్రాప్యసన్మంత్రరత్నంబు నుడివి ధైర్యం
బుతోడ। ధర్మాంతరంబులు దలఁచకాతని దాస్య మదియె తారకముగాన
నవరతము। చేయుటే మోక్షమందుకుఁ జింత లేదు। అదియె సిద్ధించునుర్విభా
గ్యాధికులకె। గుప్తనిధిఁబోలి యది పరాంకుశయతీంద్ర। ముఖ్యులెంచఁగింప
లక్ష్మణ మునికిఁ గలిగె॥ ౨౬

తా॥ భూమియందు దకించనులయ్యును రక్షకాంతరములేని సకల చేతనులకును రక్షకుండైన శ్రీయఃపతియె మాకు ప్రాప్యోపేయమని సదాచార్యోపదేశముచేతఁ బొందఁబడిన మంత్రరత్నము నుచ్చరించి ధైర్యముతోడ నుండవలెననియు ధర్మాంతరములు తలంచక యతనిదాస్యమే యధిక ఫలమనియు ననవరతమును దారకపోషక భోగ్యములుచేయుట మోక్షమనియు నిందుకు విచారములేదనియు నిదియెవ్వరికి సిద్ధించుననఁగా భూమిలో భాగ్యవంతులైన మహాత్ములకనియు దాఁచిన నిక్షేపమువలె నుండుదురనియు నదియును నమ్మాళ్వారులును నెంబెరుమానారును భట్టరుజీయరును వీరానతించుగా నెంబెరుమానారు జీయరుకుఁ గలిగెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తెలిసిన భాగ్యవంతులకే యీ మోక్షమార్గము గాని కడమవారికి లేదని యానతిచ్చి విధి నిషేధములుగా నుండఁబడిన ధర్మములను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ విధి నిషేధాకార వివిధ ధర్మంబుల విముపంగమైయున్న విద్య
యేది। సకృదనుష్ఠానకృజ్జన మోక్షదాకార విఖ్యాతమైనట్టి విద్యయేది। సద్గు
చవిశ్వాస సంయుక్తజనకామ విశ్రాణ నోద్యుక్త విద్యయేది। యారబ్ధఖం
డోత్తరాత్మబుద్ధ్యుద్భూత విమతాఘ నాశన విద్యయేది। విరహితాంతిమసం
స్మృతి విద్యయేది। వినుత శేషాంతఫలదమౌ విద్యయేది। విద్యలకుఁదోడు పడు
చున్న విద్యయేది। యదియు లక్ష్మణముని కృప నవని నిలిచె॥ ౨౭

తా॥ వేద శాస్త్రముల విధించిన ధర్మములును నిషేధములుగాఁ ద్రోయఁబడిన ధర్మములును నిట్టి ధర్మములను విడిపించిన విద్య యేదియనియు నొకమా రుచ్చరించిన సర్వజనులకుఁ బ్రఖ్యాతముగా మోక్షమిచ్చెడి విద్య యేదియనియు విశ్వాసముతోఁ గూడిన ప్రపన్నజనుల కోరికలివ్వ సమర్థమైన

విద్య యేది యనియుఁ బూర్వ కర్మములను నీ శరీరమునఁ జేసిన కర్మములను జెరిచి యాత్మ వాసనారుచులను గూడ బుద్ధి చెఱచెడి మహాపాపములఁ బోఁగొట్టఁబడిన విద్యయేది యనియు శరీరాంతమందు స్మరణ వలదని కర్మములను విశిపించి సద్గతియిచ్చెడి విద్యయేది యనియు నుచ్ఛరించకనే దేహావసానమందుఁ గడతేర్చెడి విద్యయేదియో యాశ్రిత సులభమైన విద్యయే యెంబెరుమానారు జీయరు కృపచే భూమియందు నిలిచెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (సకలవేదతాత్పర్యవిశేషజ్ఞానమును నానతిచ్చి తత్త్వత్రయ వైభవములనుమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తత్త్వముల్ మూఁడని తారతమ్యము చెప్పి స్వపారిశ్వ హే
యతత్త్వములు దెలిపి । యవ్యాపక వ్యాపకాఖ్య వర్గద్వయ శ్రేష్ఠమం
త్రార్థ ప్రసిద్ధిఁ జూపి । తదుచితాకార త్రితయ లక్షణాత్మ స్వరూప ఫల
ప్రాప్తిరుచి యొసఁగి । మన్నించి నిజకృపామాత్ర ప్రసన్న సద్దేశిక స్వీకృతి
స్థితియు నిలిపి । భయము లేకుండఁ జేసి నిర్భరుని జేసి । కాచి రక్షించఁ దనకే
మి కారణంబు । ఖ్యాతి లాభార్చనల వాఁడు కాఁడు గనుక । దేవుఁడే యాను
లక్ష్మణ దేశికుండు॥ ౨౮

తా॥ మూఁడు తత్త్వముల తారతమ్యములానతిచ్చి తానుబొంది యుండెడి హేయ తత్త్వములైన సత్త్వరజస్తమములఁ గూడిన గుణములుగల ప్రకృతి స్వరూపమానతిచ్చి శ్రియఃపతి మంత్రములలోని వ్యాపకములనియు నవ్యాపకములనియు రెండు దెఱంగులఁ బ్రసిద్ధి చూపిరనియు నా రహస్యము యొక్క మూఁడు పదముల నిర్ణయమును నందలి ఫలరుచి యొసఁగిరనియు మఱియు మన్నించి చేరఁదీసిరనియు నిజముగాఁ గృపయుంచిన యాచార్యునికిఁ బరవశుండై వారివాఁడ ననుకొనవలె ననియు నాచార్యుండును దమశిష్యుఁడౌనను నట్లుండవలె ననియు భయము లేకుండఁ జేసి కాచిరక్షించఁ దనకేమికారణమనియు ఖ్యాతిలాభార్చనల వాఁడు కాఁడు గాన నితండె దేవుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఆచార్యాభిమాన మందున్న చేతనునికి భయము లేకుండ రక్షించిరని యానతిచ్చి గురు పరంపరకు మొదటి యాచార్యుండు శ్రియఃపతియని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ గురుపరంపరకాది గురుఁడు లక్ష్మీపతి కువలయంబునఁ బరాం
కుశులునట్ల । మతకర్త యెంబెరుమానారునసికని వెనుక వరవరయోగి విశ
దపఱచె । ననిచెప్పి తాఁ జతుష్టాన్వయుఁ గాఁ జేసి తనుఁగాచు దేశికోత్త
ముఁ డెవ్వఁడు । నుపకారకులనయ్యె నుత్తారకులనని వారినైక్యతఁ జూచి

వరుసతోడఁ । దత్తదతిశయమేకోరి ధరణిలోన । మంగళాశాసనముఁ జేసి మఱపులేక । తలఁచుచుండెడి వైష్ణవోత్తమునిఁగూడె । యుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౯

తా॥ గురుపరంపరస్థైన పూర్వాచార్యులకు శ్రియఃపతి మొదటి యాచార్యుండనియు వెనుక నమ్మాళ్వారులనియు నా వెనుక యీదర్శన కర్తయైన యెంబెరుమానారనియు నా పిమ్మటఁ బెరియ జీయరనియు నీనలుగురిని గూర్చి తన్ను రక్షించిన యాచార్యుని మఱువక నెప్పుడును నుపకారకులని యుత్తారకులని వారినైక్యము చూచి వరుసతో వారియతిశయమే కోరి భూమిలో మంగళాశాసనముఁ జేయవలెననియు మఱపు లేక తలంచుచుండెడి శ్రీవైష్ణవోత్తములఁ గూడి యుండవలెనని లక్ష్మణార్య్యులానతిచ్చిరి॥ (ఉపకారకోత్తారకుల నైక్యమానతిచ్చి యీయాత్మ స్వతంత్రము లేని వాఁడని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ నే స్వతంత్రుఁడ నాకు నేనె రక్షకుఁడను నే నూరకుండుట నీతి యగునె । యఁైహికస్థితి కర్థయత్నము చేసి పారలౌకికధర్మ పరులు నగుచు । నుందురు కొందఱు తీయ్యర్థిలో నజ్ఞులై కానరీశ్వరుతలఁపు కర్మగతియుఁ । ధరనజామీఢ శతధన్వ ప్రవృత్తుల భంగియుఁ దత్ఫలప్రాప్తి విధము । నెఱిఁగి పెద్దలు సర్వంబు నీశ్వరునకె । శేషమైనాది నే నని చెప్పరతని । సొమ్మె మేమన స్వామి దాఁ జూచుఁ గృపను । ననుచు నీ గుహ్యమును లక్ష్మణార్యుఁ డెఱుఁగు॥ ౩౦

తా॥ నేను స్వతంత్రుఁడను నాకు నేనే రక్షకుండను నూరకుండునది యుచితమూ నాకనియు నీతలంపున స్వర్గాది భోగములకుఁ బోయి యనుభవించవలెననియు నీలోకములో నైశ్వర్యమునఁ గూర్చిన ద్రవ్యముచేతఁ బరలోక సాధనములైన యజ్ఞాది కర్మములఁ జేయుచుందురని యీ ప్రకారము కొందఱీ బ్రాంతిలో నజ్ఞానులై శ్రియఃపతి యిష్టము నెఱుఁగక కర్మగతులఁ బడుదురని యు నజామీఢుఁడును శతధన్వుఁడును వీరు మొదలైన వారినడతలును వారు ఫలమును బొందిన విధమును నెఱిఁగి పెద్దలు శ్రియఃపతికే సకలమును శేషమని యు నాది నేననియనక యతని సొమ్మనియు నతనిసొమ్మైన వానుఁ దా మేలిన యేలుకగనుక కృపఁ జూతురనియు నిట్టి రహస్యమును లక్ష్మణాచార్య్యులానతిచ్చిరి॥ (అజామీఢుఁడు శతధన్వుఁడావి గాఁగల మునుపటివారు పరమార్థమైన రహస్య మెఱుఁగక కామ్యకర్మములఁబడి యజ్ఞులై చెడిన ప్రకార మానతిచ్చి

శ్రియఃపతికి శేష వృత్తిని దాస్య ధర్మమును మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తనకు విధేయమై తనరిన దేహంబున పగతె పరిమళశూన్యమైన పువ్వు। కాంతిఁ బాసినయట్టి కమనీయ రత్నంబు మాధుర్య రహితనిరర్థకమైన పయస్సు। మాటలోపల రాక మారాడు భార్యయు ద్వేషించి తండ్రిని దిట్టు కొడుకు। చెప్పిన పనులెల్లఁ జేయనిబంటును చాలు పిదుకని గొడ్డు పరచు గోవు। కలిగియునులేని మాత్రమేకాక మఱియు। వ్యసన హేతువులైనట్టి యాత్మహారికి। శేషమైయుండి దాస్యంబు సేయకున్న। యట్ల యగునని మా లక్ష్మణార్యులనిరి॥ ౩౧

తా॥ తనకు విధేయముగాని శరీరమును బరిమళము పోయిన పువ్వును గాంతిలేని రత్నమును మధురములేని పాలును దన మాట వినని యిల్లాలును గన్నతండ్రిని దిట్టెడు కుమారుఁడును నేలిన వాఁడు చెప్పిన పనులు సేయని బంటును బాలివ్వని గొడ్డావును నివి కలిగియు లేనిమాత్రమే కాక మఱియు వాని వలన వ్యసనము గలుగుచేకాని పనికిరావలయు నీయాత్మ శ్రియఃపతికి శేషమై యుండియు శ్రియఃపతికి వైష్ణవులకు దాస్యము సేయకున్నను వానివలెనగు నని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఈయాత్మ శ్రియఃపతికి శేషమైయుండియు శ్రియఃపతికి వైష్ణవులకు దాస్యము చేయకున్న వ్యర్థమానని యానతిచ్చి సారతమశాస్త్ర నిర్ణయము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆ బ్రహ్మ పర్యంత మగు దేహ సుఖమెల్ల సాపాయమల్ప మసారమనియు। నాత్మానుభవ సుఖం బైశ్వర్యముల కన్న శక్త మయ్యును నల్ప సారమనియుఁ। బరుండైన హరినొకనిఁ బట్టి లక్ష్మియుఁ బోలె మను సుఖం బదిసార మాతనునియు। నాదంపతులనిత్యు లనుభవించెడి సుఖము తల పోయ నది సారతరమెయనియు। సారతమశాస్త్ర సారార్థ సరణిఁ దెలిసి। యఖిలవైష్ణవ జనదేశికాధి సతిని। నుడయవరుఁ గొల్చి లక్ష్మణయోగివలెనె। యనుభవించుట సారతమాతిసుఖము॥ ౩౨

తా॥ బ్రహ్మాది పిపీలిక పర్యంతమగు ప్రాణికోటుల దేహ సుఖమెల్లన సారమనియు నాత్మానుభవమైన కైవల్యసుఖ మల్పము గనుక యల్పసార మనియు శ్రియఃపతి యొకనిఁ బట్టియు ననుభవసుఖము సారమనియు నాదంపతులఁజేరి నిత్యసూరులనుభవించెడి సుఖ మతి సారతరమనియు సారతమ సారార్థ సరణిని దెలియువలెననియు వైష్ణవులకు నాచార్యశ్రేష్ఠుఁడైన యెంబెరుమానారును గొలిచిన యెంబెరుమానారు జీయరువలెననియు ననుభ

వించుట సారతమాదీ సుఖమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (అసారమును, నల్ప సారమును సంసారమును సారతరమును సారతమముల నిర్ణయము లానతిచ్చి యెవ్వఁడు బ్రహ్మాండములను జతుర్దశలోకములను గల్పించి బ్రహ్మాదులు మొదలైన యాత్మలకు శరీరములిప్పించి పుట్టుకలు చేసెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఎవ్వండు బ్రహ్మనీ రేడులోకంబుల కర్తృలఁ బుట్టించ నాదిఁజేసె। నెవ్వండు బ్రహ్మకు నెఱిఁగించె భోగమోక్ష జ్ఞాపకామ్నాయ జాలము పుడె। యెవ్వండు శ్రీబాల కేలికనైశీల సౌలభ్యవాత్సల్య జలధియయ్యె। నెవ్వండు పలుమాఱు నిలబుట్టి దయచేతఁ బరమధర్మము తానె బయలుపఱచె। నెవ్వఁ డఖిలాత్మలకు మోక్ష హేతువగుచు। నాత్మ బుద్ధి ప్రసాదకుండగుచునుండు। రక్ష్య బద్ధ ముముక్షుశరణ్యుఁడతఁడె। కేవుఁడని చెప్పె లక్ష్మణ దేశికుండు॥ 33

తా॥ చతుర్ముఖ బ్రహ్మను బధ్ధాలగు లోకములను జీవములను వారివారి కర్మవశములఁ బుట్టించ నెవ్వఁడు కర్తృడ చేసెననియు బ్రహ్మకు భోగమోక్షములఁ జెప్పెడి వేదశాస్త్ర జాలముల నెవ్వం డుపదేశము చేసెననియుఁ బెరియపిరాట్టిని నెడవాయని యేలికనై సౌశీల్య సౌలభ్య వాత్సల్య గుణములకు సముద్రుం డెవ్వండామె ననియు నెవ్వండు భూలోకమునఁ బుట్టి కృపచేతఁ బరమధర్మము తానె బైలుపఱచెననియు సమస్తాత్మలకు నెవ్వండు మోక్ష హేతువయిన వాఁడగుచు నీయాత్మకు నంతర్యామినై యుండియు నెవ్వండు బుద్ధి ప్రసాదించు ననియు బద్ధులను ముముక్షువులను రక్షించెడు శరణ్యుఁ డెవ్వండో యతండె దేవుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (సమస్తాత్మలకు దిక్కై రక్షించెడివాఁడు శ్రియఃపతియని యానతిచ్చి శేషత్వ పారతంత్ర్యములువిడిచి స్వతంత్రులైన విధముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీశైక శేషత్వ సిద్ధస్వరూపంబు తలఁచ నేరక దుస్వతంత్రులగుచు। సిద్ధసాధన సర్వశేషి పరిగ్రహంబుడిగిన స్వరక్షణోద్యుక్తులగుచు। భగవదన్యేషానుభవ యోగ్య నిజభావ మఱియక కామమోహాంధులగుచు। ధరణి నాకారత్రితయ పూర్ణ వైష్ణవ సంఘంబువిడిచి సంసారులగుచుఁ గర్మపరతంత్రులై కడఁగానలేని। జనులరక్షించఁ బలుమాఱు జగతిఁబుట్టి। దేశికాకారుఁడైవచ్చి తెలుపుచేవుఁ। డనుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ 34

తా॥ శ్రియఃపతి శేషత్వమును దవస్వరూపమును దలంచ నేరక దుస్వ

తంత్రులైరనియు సిద్ధముగా సర్వశేషియైయున్న యతండె రక్షకుండనక తమకుఁ దామె రక్షకులనియు డిగనియు శ్రియఃపతికి నిష్టమై యనుభవయోగ్యమైన మనస్సు స్త్రీలకోరికలచేత మోహాంధు లగుదురనియు, భూమియందాకారత్రయము నిండారుబుగఁగలిగిన శ్రీవైష్ణవుల సంఘమువిడిచి సంసారులగుదురనియు నిటువలెఁ గర్మపరతంత్రులైన జనుల రక్షించఁ బలుమారీజగత్తునఁబుట్టి యాచార్యుఁడైవచ్చి యానతిచ్చి రక్షించు ననుచు లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (కర్మ పరతంత్రులై కడఁగానలేని జనులకు నాచార్యుండె రక్షకుండని యానతిచ్చి శాస్త్రసిద్ధములైన కర్మ సాధ్యసాధనముల విడిచి శ్రియఃపతి తిరువడిగఁ బట్టవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ శాస్త్రసిద్ధిని నితర సాధ్యసాధనములు విడిచి శ్రీశాఙ్ఘ్రులె పెదకేపట్టి। ధర శ్రీశునాజ్ఞాభి ధానంబులాసక్తరీతి నితరులనాచరింపఁ జేసి। భగవదనుజ్ఞాను భవదాస్య మెప్పుడు నుబ్బుచుఁ దత్తదీయులకుఁ జేసి యఖిల జనోజ్జీవనార్థంబుగో భూమిఁదత్త్వరహస్య పత్థకులు దెలిపి। సౌవ్యసౌశీల్యవాత్సల్య శాంతిదాంతి। భక్తి వైరాగ్య శేముషీ ప్రముఖ గుణము। లన్నియును గూర్చి తిరుమేని యందె చూపి। జనుల రక్షించు లక్ష్మణాచార్యవరుఁడు॥ ౩౪

తా॥ బహు శాస్త్రములచేతఁ జెప్పఁబడిన యితరమైన సాధ్యసాధనముల విడిచి శ్రియఃపతి తిరువడిఘలు పట్టవలెననియు శ్రియఃపతి యాజ్ఞావిధానమునందు నాశగల యితరులైన వారిని శ్రియఃపతిని నాశ్రయింపఁ జేసిరనియు సమములు సౌశీల్యవాత్సల్యములైన గుణములను శాంతిదాంతిని భక్తి వైరాగ్యమును శ్రియఃపతి యనుజ్ఞను నతకే ననుభవమైన దాస్యమెప్పుడును సంతోషమున నుబ్బుచు శ్రీవైష్ణవులకుఁ జేయవలెననియు సమస్తజనులుజ్జీవించి బ్రతుక వలెననియుఁ దత్త్వరహస్యముల నానతిచ్చి బుద్ధియందుంచఁబడిన ముఖ్యమైన గుణము లన్నియునుగూర్చి తమతిరుమేని యందుఁ జూపిరనియు సకలజనులను రక్షించు నెంబెరుమానారు జీయరని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (శ్రియఃపతి నుండి యాచార్య పర్యంతమును రహస్యము వచ్చినవిమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ శ్రీనిధి శఠవైరి చిత్తంబులో నుండి వేదార్థ మెల్లను విశద పఱచె। శఠవైరి యతి పతి స్వాంతస్థుడై తత్త్వ హిత పురుషార్థంబు లెఱుఁగఁ జెప్పె। యతిపతి వరవరాహ్వయయోగి యందుండి సర్వరహస్యార్థ సరణిఁ జూపె। నా వరవరముని లక్ష్మణార్య హృదిస్థుఁడై చరమాధికారి నిష్ఠయును

చెలిపె! నట్టి లక్ష్మణముని యస్మ దంతరంగ । మందుఁదాను డి మో క్షార్థిన్నై
నఁ దెరువు । కానుపించ ముముక్షు నృకల్పకంబు । పేరని కావ్య మిప్పడీ
పృథివి నిలిచె॥ ౩౬

తా॥ శ్రియఃపతి నమ్మాళ్వారి మనస్సు నందుండి వేదాంతార్థములను
ద్రావిడ రూపముగా నానతిచ్చి రనియు నమ్మాళ్వారు లెంబెరుమానారు
హృదయ మందుండి తత్వహితమైన పురుషార్థముల నానతిచ్చి రనియు నా
యెంబెరుమానారు పెరియ జీయరు చిత్తములో నుండి సర్వ రహస్యార్థ
తాత్పర్యములఁ బ్రసాదించి రనియు నా పెరియ జీయ రెంబెరుమానారు
జీయరు స్వాంతమందుండి చరమాధికారినిష్ఠ నానతిచ్చిరనియు నట్టి యెంబె
రుమానారు జీయరు దాసుని యంతరంగమందుండి మోక్షార్థులకైన త్రోవ
కానుపించవలెనని ముముక్షుజనకల్పకంబను ప్రబంధం బిప్పడీ భూమియందు
నిలిపిరనీ లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబను మహా ప్రబంధంబు నందఖిలవేదాం
తోక్తసత్యాది సామాన్యవాచక విశేష పర్యవసాన గౌణముఖ్యోభయాకార
విష్ణు వాసు దేవాద్య సామాన్య శబ్దాభిధేయుండు నారాయణుండని చెప్పె
డు ప్రకారంబును స్వరూప స్వభావాదిలక్షణ బహుప్రకార వర్ణనీయాపర
తత్వనిర్ణయ ప్రకారంబును నతండె నవవిధప్రభృతి సంబంధములవలనఁ జేతన
ప్రాప్యమన్న ప్రకారంబును స్వచరణ కమలసమాశ్రయణ కృతకృత్య ప్రాప్తి
ప్యాయ భవోత్సుక చేతనుని స్వదేశముఁ జేర్చి తాను భోగించునన్న ప్రకా
రంబును నాచార్యులైై తానెయవతరించి శాస్త్రసారార్థములు పలుమారు
తెలుపునన్న ప్రకారంబును నట్టియాచార్య సమాశ్రయణునికి విహిత నిషి
ద్ధ విషయ భోగంబులు త్యాజ్యమన్న ప్రకారంబును దనసర్వేంద్రియములకుఁ
బ్రాప్త విషయాసక్తిగలిగి సఫలంబుగాకున్న సంసారదశను గరణ విహీను
లై యుండెడు నునికి మేలన్న ప్రకారంబును గొంద అవివేకులు రూప నామ
ధారులై పెద్దలఁ గూడి వారికిఁ గీడుదలంచి చెడుదురన్న ప్రకారంబును శేషి
నైనవాఁడు మారాడిన నెడ శేషత్వాదులు చూడక తదిష్టంబుచేయుటే స్వ
రూపమన్న ప్రకారంబునుఁబ్రణవాది పదత్రయోక్తస్వరూపజ్ఞానానుష్ఠానాధి
కారి ఫలప్రాప్తి ప్రకారంబును బ్రాప్తాప్రాప్త వివేక శూన్య సంసారి రక్ష
ణార్థమై భాష్యకారులవతరించి తెలుపుదురన్న ప్రకారంబును సుత్తరోత్త
రాధి కారార్హ ఫలాధిక్యముఁ జెప్పెడిశాస్త్రసారార్థ మెట్టిదని తత్ఫలావా

ష్ఠుండుగావలెనన్న ప్రకారంబును నేకాంతి యవ్యేషు ప్రకారంబును నంతర్యామిమైన సర్వేశ్వరుండఖిలాత్మ ప్రవృత్తినివృత్త్యాదికర్తయని యెఱుంగుట యెఱుక తదస్వాతంత్ర్యలక్షణంబన్న ప్రకారంబును భాగవతాప... కార్య తత్సంబంధవైభవప్రకారంబును శ్రీశ్రీశతదీయాచార్య కృపమహోపకారాదిస్మృతిప్రకారంబును నితరములు మాని భగవత్ప్రాప్తిగోరి యాచార్యపమాశ్రయణ తదీయానువర్తన దృఢవ్రతులకు నమస్కరించుచున్న ప్రకారంబును నఖిల బ్రహ్మాండకర్త కర్మపాశంబులఁ గట్టిన నతనిచ్ఛనే ముక్తులౌదు రితరులతనిలీలకే విషయమై యుందురన్న ప్రకారంబును ననేక జన్మాదులెత్తెప నాత్మలకుఁ గర్మభూమిజననంబున భగవద్భక్త్యాదులు గలిగెనేని ముక్తులౌదురన్న ప్రకారంబును యాదృచ్ఛిక భగవత్కటాక్ష లబ్ధప్రపత్తి నిష్ఠులాచార్యాభిమాన నిష్ఠులు మోక్షమును బొందుదురన్న ప్రకారంబును హరి తానే దేశికుండైవచ్చి పంచ సంస్కారాది యుక్తునిజేసి స్వ గురుపర యతివర శఠజిత్సంబంధులై వీని హృదయంబున నిలిపి యుండుసన్న ప్రకారంబును బంధ మోక్షంబులందు నాత్మలకు నీశ్వరుని నెడ తెగనిదిగాఁ జేసి తదీయసంబంధంబు తెలిసిన వారిబంధంబులు తెగునన్న ప్రకారంబును త్రైవర్ణాధికారులు భగవత్ప్రాప్తివలన మోక్షంబు లభింతురన్న ప్రకారంబును భాగ్యాధికారి లబ్ధప్రపత్త్యైశ్వర్యలాభము లక్ష్మణార్యులు లభించిన ప్రకారంబు పత్త్యధిక్య వైభవప్రకారంబును లక్ష్మణార్యులు స్వోపదేశలబ్ధజ్ఞానా... నింజేసిరక్షించుసన్న ప్రకారంబును ప్రధానగురు చతుష్టయసంగ కృతా... ర్యోపకారో త్తారకత్వజ్ఞ తత్తన్ముఖోల్లాసకర వైష్ణవ సహవాసము యుండవలె నన్న ప్రకారంబును స్వస్వామి సంబంధ మెఱిఁగిన నేమనాదియనరన్న ప్రకారంబును నాత్మకు శేషత్వముగలిగి తత్కా... లేకున్న స్వరూపసిద్ధిలేదన్న ప్రకారంబును నన్నది యేకాదశ ప్రకరణము.

సంపూర్ణము.

శ్రీమదచ్యుత శఠకోప యతిరాజ వరవరముని నిజగురుభ్యోనమః.



మంత్ర తంత్రములు:- మంత్రో రత్నాకరములు, మళయాళమంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

వేదాంతములు:- సీతారామాంజనేయ సంవాదము, శుష్క వేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవద్గీత, ముముక్షుజనకల్పము, భంహుసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివగీత, సుజ్ఞానరత్నావళి వగైరా.

ఉపనిషత్తులు:- కొలది రకములు.

సంస్కృతకావ్యములు, నాటకములు:- నీతిశాస్త్రములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

వ్యాకరణము, అలంకారము:- శబ్దమంజరి వగైరా.

నిఘంటువులు, అమరము:- ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రభోధిక వగైరా.

ఆంధ్రగ్రంథములు:- అపూర్వ సంఘసంస్కరణము, భారతము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమంజరి, శృంగారశంతాబరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి వ॥.

శతకములు:- కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, కాళగుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకములు, టీకా తాత్పర్య శతకములు వగైరా.

కథలు, వచనములు:- నిజమైన కాశీమజలీ కథలు, కాశీ రామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు పకీర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

నవలలు:- అనురాగవిపాకము, సుశీలామైనావతి, రాజమండ్రి, బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

జీవిత చరిత్రములు:- ఆసియాఖండ విజ్ఞాన రహస్యములు, దేశనాయకుల చరిత్రలు వగైరా.

ఆనందమయములు:- పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూహల రహస్యములు వగైరా.

---

చిరునామా:- ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రవర్ధనలు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, రాజమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నోవందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అద్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, రామదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, రుక్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, వంతవేలూరు, ప్రహ్లాదలు, వీరభద్ర. రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహాత్మ్యం, శారదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, కుమ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, గరుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళా దేవి. తులసిగోవిందము. పడవపాట. మేలుకొలుపులు. విచిత్ర విడికథ సవాలు. లడ్డూ. పకోడి సంవాదం చెన్నపట్నం. బెజవాడ. రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్థసారసంగ్రహము. గానవిద్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- బాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్లేయఔషదయోగములు. వైద్యనిఘంటువులు. శుశ్రుతశారీరస్థానం చెన్నపట్నం. రాజమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంధములు చాలకలవు.

జ్యోతిషగ్రంథములు:- కాలచక్రం. బృహజ్జాతకం. చెన్నపట్నం. బెజవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నోకలవు.

ఆర్టులు, పాకశాస్త్రములు, ఫార్సులు. వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురాఘయ్యగారి. సుదు;
బుర్జుపేట. విశాఖపట్నము.

…హాజ్జాతకము 2-0-0 గ్లేజు 3-0-0
…లచరిత్రము 1-0-0 గ్లేజు 1-8-0
…నప్రదీపిక అను మళయాళ ప్రశ్నలు
వెల 5-0-0
…లకఫల విజ్ఞానమను పుట్టుమచ్చల
ఫలము 0-3-0
…కరళపంచపక్షిప్రశ్న శాస్త్రము 0-8-0
…సయోగ రత్నాకరము 2-0-0
…శ్రిత శారీరస్థానము 2-8-0
…ర్పశాస్త్రము 0-8-0
…ర్బత్ పాక రత్నావళి 0-6-0
…హాదేవ పశుచికిత్స 0-6-0
…ద్య శతశ్లోకి 0-4-0, 0-6-0
అనుపాన మంజరి 0-8-0
…డీనిదానము తాత్పర్యం 0-4-0
…డీజ్ఞానము 0-4-0
…బ్రహ్మవిద్య 0-2-0
…ష్క వేదాంత తమోభాస్కరము 3-0-0
…తారామాంజనేయ సంవాదము
…సంగ శేషాచలశాస్త్రిగారి ఆంధ్రటీకా
తాత్పర్య విశేషార్థ సమన్వితము
వెల 3-8-0 గ్లేజు 6-0-0
…కైవల్యనవనీతము 5-8-0
…న్యానామృతం 0-6-0
…మ్మోహనశాస్త్రము అందు అదృష్ట
తాజము 1-8-0
…భ్యాసన చక్రము 0-4-0

వేదాంత భక్తికీర్తనలు 0-1-0
యాజుషప్రయోగ చింతామణి 2-0-0
వ్రతచూడామణి 2-0-0
సకల మంత్రోపాసనక్రమము 0-6-0
దేవీస్తోత్రకదంబము 0-8-0
శివస్తోత్రామృతం 0-4-0
కవిచౌడప్ప శతకం 0-2-0
కల్కిపురాణము 0-12-0, 1-4-0
తెనాలిరామలింగని కథలు 0-4-0
రంగదాసు భజనకీర్తనలు 0-4-0
సుశీల మైనావతి 0-8-0
మరకతవల్లి 0-10-…
శమంతసేన 0-4-0
దొరికితివిరా దొంగ 0-6-…
నేనే దొంగను 0-8-…
విషాద వాసంతిక 0-6-…
వలపుల మడుగు 0-4-…
శకుంతల జనన నాటకం 0-8-…
వైకుంఠ మహాత్మ్యం 0-8-…
ఉషాకళ్యాణం బాణాసురయుద్ధం 0-12-…
కపటవేశ్యా నాటకం 0-10-…
మైరావణ నాటకం 0-8-…
ధర్మాంగద నాటకం (పాలుట్ల) 0-6-…
ఉషా నాటకం (తిరునగరు) 0-4-…
వీరభద్ర నాటకం త్వరకవి 0-10-…
పడకటింటి రహస్యాలు 1-0-…

ఇంకా అనేక రకములు గలవు.

కాలమానపరిస్థితుల ననుసరించి ధరలు మారుచుండును.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 18/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.



నవీన ప్రింటర్సు, విశాఖపట్నం. 9-11-51

